


ఓం.

పరబ్రహ్మణేనమః.

# బ్రహ్మోపాసనాపద్ధతి

# బ్రాహ్మగీతములు

---

[illegible]సారసూచి.

బ్రాహ్మమతము నందలి సారమును అలయు [illegible]

సువిశాల మిదంవిశ్వం పవిత్రం బ్రహ్మమన్దిరం,
చేతస్సు నిర్మలం తీర్థం సత్యంశాస్త్ర మనశ్వరమ్,
విశ్వాసో ధర్మమూలంహి ప్రీతిః పరమసాధనమ్,
స్వార్థనాశస్తు వైరాగ్యం బ్రాహ్మైరేవం ప్రకీర్త్యతే॥

దక్షిణయిండియా బ్రాహ్మసమాజపు వారిచేత
ప్రచురింప[illegible]బడినది.

చెన్నపురి.

ఆఱవకూర్పు ౨౦౦౦ ప్రతులు.

చెన్నపట్టణము: ఇండియా ముద్రాక్షరశాల

౧౯౧౫

దీనివెల మూడు అణాలు.

# విషయసూచిక

## బ్రహ్మోపాసనా

IV

# బ్రాహ్మ గీతములు

## ఉద్బోధనము



## స్తోత్రము

V

## స్తోత్రము

గీతము. ఫుట.



## వందనము



## ధ్యానము



## ధ్యానము



## అనుతాపము



## ప్రార్థన

VII

## ప్రార్థన



## తత్వోపదేశము

## తత్త్వోపదేశము



## ధర్మోపదేశము



## మంగళము

## గొబ్బిపాట



## మేలుకొలుపు



## లాలిపాట



## నూతనగీతాదులు

గీతము. పుట.

ఓం

బ్రహ్మణేనమః.

# బ్రహ్మోపాసనాపద్ధతి

## ఉపోద్ఘాతము

బ్రహ్మోపాసన, స్తోత్రవందనము, ధ్యానము, అనుతాపము, ప్రార్థన అను నాల్గంగంబులఁ గలయది.

స్తోత్రము-ఈశ్వరునియొక్క పరిపూర్ణ నిత్యలక్షణములను తలఁచి మనభక్తిశ్రద్ధలను తెలుపుట. వందనము - మనలను మనము వసించు శరీరములను సంరక్షించువాని యపారకరుణను మదిని నిల్పి, మనకు మనకుఁగల కృతజ్ఞతను బయలు పెట్టుట. ధ్యానము - భగవంతుని యొక్క సర్వవ్యాపకత్వము, సర్వజ్ఞత్వము, సర్వకారుణ్యత్వము, సర్వనిర్మలత్వము, మొదలైన నిఖిల హేయ ప్రత్యనీకాంత కల్యాణ గుణములను చింతించి, యాతని యత్యంత సామిప్య సాన్నిధ్యములను జ్ఞాననేత్రముచే దర్శించుటకు ప్రయత్నపడుట. అను తాపము- తాను చేసిన తప్పులను తన యాపదలను తలఁచి మనస్సు నొవ్వ చింతిం

చుట. ప్రార్థన - పాపబంధంబులనుండి తొలఁగించుటకును, ఆత్మ శాంతియును పారిశుద్ధ్యమును ప్రసాదించుటకును,' దేవుని వినయముతో వేడుట—ఈ నాల్గంగంబులును తగినరీతిని అమరియుండుటయే బ్రహ్మోపాసన అగును.

మనయుల్లములయందు ఈశ్వరవిషయమైన గంభీర భక్తియు నిష్కపటమైన కృతజ్ఞతయు పూర్ణముగా వ్యాపించి, ఈశ్వర సాన్నిధ్యానుభవమును పొందవలయుననెడి యాశ యీడేరి, పాపబంధనివారణేచ్ఛపరిపూర్తి జెందెనేని, ఆ యుపాసనోద్దేశము సిద్ధించినట్లగును. వీనియందు కాలానుగుణముగ కొన్ని అధికమగుటయును, కొన్ని తగ్గుటయును, సహజము. ఎట్లన్న ఎదురుచూడని మంచి యొకటి తటస్థించినపుడు కృతజ్ఞత హెచ్చి వందనమాచరించుచున్నాము. దుఃఖమును తొందరయును అధికమయినపుడు ప్రార్థన హెచ్చగుచున్నయది. ఇట్లు సమయోచితముగా తటస్థించుట సాధారణము. దానిని అణచుట చెలుపు అయినను సామాజికోపాసనయందు భక్తిసంబంధమగు యాత్మవృత్తులు పలుతెఱఁగుల విజృంభించి తృప్తిని పొందునటులు ఆనాల్గంగంబులును నిండి యుండవలయును.

ఈగ్రంథము సామాజికోపాసనయొక్క యొకపద్ధతిగా ప్రచురము చేయఁబడియె.

---

(ఉపాసకులు కొందఱయినను, అందఱయినను ఒక బ్రాహ్మ గీతము పాడిన పిమ్మట ఉపాసన ఆరంభింప వలయును.)

## ఉద్బోధనము

### బ్రహ్మమునకు నమస్కారము

ఎవ్వఁడు ఈ లోకమును సృజించియేలుచున్నాఁడో ఎవఁడు ఇందుండెడి యెన్నఁగూడని ప్రాణులను అపారకరుణతో కాచుచున్నాఁడో, ఎవ్వాఁడు పాపులగు మనలను పావనులనుగా చేయసమర్థుఁడో అతఁడొక్కఁడే అప్రమేయ పరబ్రహ్మాఖ్యుఁడు. అతఁడు ఈ యుపాసనా స్థలమునందును వేంచేసియున్నాఁడు. మనము అతనిని భక్తితో ఉపాసించుటకై యిచ్చటచేరి యున్నారము కాన అతఁడు మనయుల్లములయందు పవిత్రమైన శ్రద్ధయును ప్రీతియును కలుగునట్లు కరుణించి మన ప్రార్థనలను సఫలముగ కావించునుగాక. (ఇచ్చట ఉద్బోధనారూపమయిన బ్రాహ్మగీతమును పాడవలెను.)

## స్తోత్రవందనము

"సత్యంజ్ఞాన మనన్తం బ్రహ్మ అనన్దరూప మమృతం యద్విభాతి శాన్తం శివ మద్వైతం శుద్ధ మపాపవిద్ధమ్."

నిత్యుఁడై సత్యమే స్వరూపముగాఁ గలవాఁడై, ఈ విచిత్రప్రపంచమునకు కారణభూతుఁడై, దీనియందు ఉండెడి సకలాత్మలకును

ఆత్మయై, లోపలను వెలుపలను అంతటను నిండియుండెడి లోకనాయకుఁడా! నీరక్షణములేక ఒక క్షణమైనను నిలిచి ఉండుటకు అశక్తులము కాన, నిన్నే శరణుజొచ్చి నమస్కరించుచున్నారము.

ఎవ్వాని యపరిమిత జ్ఞానశక్తులను ఈప్రపంచము ఉద్ఘోషించుచున్నదో, ఎవ్వఁడు సర్వవ్యాపి యగుటచే మాముందు వేంచేసి యున్నాఁడో, ఎవ్వాడు తన సర్వజ్ఞత్వముచేత మాబాహ్యస్థితిని మాత్రమే కాక మాయుల్లములయందును అణఁగి దాగియుండెడి యెల్లపాపములను చూచుచున్నాఁడో, ఎవ్వనికి ఒక్కటిని మఱుఁగుపఱుచుటకు మేము అశక్తులమో; అట్టివాఁడై మా యుల్లములయందు కాపురము ఉండెడి సర్వజ్ఞుఁడైన యోభగవానుఁడా! నీకువందనము చేయుచున్నారము. ప్రీతితో అంగీకరింపుమా.

నిర్మలుఁడును, ఎప్పుడును ఎచ్చోటను మంచిని జేయువాఁడును, ఆదిమధ్యాంత రహితుఁడును, అనంతకల్యాణగుణ విహితుఁడును, మహాత్ముఁడును, మహిమగలవాఁడును; మా వాక్కునకును మనస్సునకును, అందనివాఁడును, సర్వవ్యాపియును, పరిపూర్ణుఁడును, అయియుండెడి యో యానందరూపుఁడా! ఈ మానవ హృదయముతో నిన్ను పూర్ణముగా ఎట్లు ఎఱుంగనగును! ఓ యపరిమితజ్ఞానస్వరూపుఁడా! నీకు నమస్కారము సమర్పించుచున్నారము. ఇంపుతో చేకొనుము.

ఓ యానందస్వరూపుఁడా! నీవు సకల జంతువుల జీవనమునకును, ఆనందమునకును, సౌఖ్యమునకును కారణభూతుడవుగా ఉండుట చేతఁగదా, సృజింపఁబడిన సకలప్రాణులును చెడుగులను పొందక కొలఁది కాలమైనను ఆనందమును అనుభవించుచున్నవి. దుఃఖసాగరమందు మునిఁగియుండు మా హృదయములు నీయందులయించి సౌఖ్యమును తృప్తినిపొందుచున్నయవి. నిన్ను ఆరాధించువారందఱును నీ దివ్యనామామృతమును వెగటులేక పానముచేసి ఆత్మశాంతిని పొందుచున్నారు. నీవిషయమునందు తక్క మాకువాస్తవమైన యానందము మఱి దేనియందునులేదు. ఓ యానందమయుఁడా! నీకు వందనము జేయుచున్నారము. కరుణించి కైకొనుమీ.

ఓ భగవంతుఁడా! నీకృపాసముద్రమునకు పారములేదు. నీవు పితృవాత్సల్యముతో దాసులమగు మమ్ము సాధారణముగా కాచుటయేకాక మాకుధైర్యమును ప్రసాదించి ఆపత్తులనుండియు వ్యాధులనుండియు మమ్ము తొలగించి యేపాపముగాని మమ్ముచేరనీక పలు దెఱంగుల మమ్ము రక్షించుచున్నావు. గతి లేనివారికి గతియును, పాపము అనెడి సముద్రమును దాఁటుటకు తగిన యోడయును ఐ, వెలయుచుండు కరుణాపూరితుఁడైన ప్రేమగల తండ్రీ! నీకు జోహారువు గావించుచున్నారము. మమ్ము రక్షింప మఱవకుము.

పాపరహితుఁడవును పరిశుద్ధుడవును అయిన యీశ్వరుఁడా! నీ పరిశుద్ధమహిమయను వెలుగుచే మాపాపమను చీకటిని పోఁగొట్టు

చున్నావు. నీసాన్నిధ్య విశేషముచేత పాపుల యుల్లములు పావనములగుచున్నవి. దయాసహితుడవైన యో నిర్మలుడా! నీవు తప్ప దాసులమగు మాకు వేఱుగతి లేదు. గనుక నీవె గతివనియును తల్లివనియును తండ్రివనియును రక్షకుండవనియును పాపవిమోచకుండ వనియును తెలిసి నీ యపారప్రేమను మితజ్ఞులమగు మాదుభాష వర్ణింప శక్తికలది కాదుకదా యని నిష్కపటముగా మనస్సునందు ఎంచి అష్టాంగ ప్రణామమును కృతజ్ఞతతో ఆచరించుచున్నారము.

(ఇచ్చట స్తోత్రరూపముగాఁగాని వందనరూపముగాఁగాని ఉండు బ్రాహ్మగీతమును పాడవలయును.)

## ధ్యానము

(ఆచార్యుఁడు ఈక్రిందివాక్యములనుచదివి ఉపాసకులను ధ్యానమునకు పురికొల్పవలయును.)

సర్వసాక్షియును, సర్వకారణుఁడును, మనలోపలను వెలుపలను వ్యాపించి యుండువాఁడును, మనతండ్రియును, స్నేహితుఁడును, తోడునీడయును, అయియుండు భగవంతుని కొంచెమైనను చాంచల్యము లేని మనసుతో మనము మననము చేయుదము. అతడు కరుణించి మన జ్ఞాననేత్రమునకు ప్రసన్నుఁడై తన పవిత్రసాన్నిధ్యమును మనము అనుభవించునట్టులు ప్రసాదించును గావుత!

(ఉపాసకులు అందరును కొంతసేపు మౌనవృత్తితో భగవంతుని లక్షణములను ఆస్తిక్యమును మనస్సునందు నిలిపి ధ్యానింపవలయును. పిదప ఉపాసకులందఱును లేచినిలిచి మౌనవృత్తిని వదలి యీగోష్ఠ్యుద్ఘుష్య ప్రార్థనను ఉచ్చైస్స్వరముతో పఠింపవలయును.)

## గోష్ఠ్యుద్ఘుష్య ప్రార్థన

### స్తోత్రమ్

1. ఓమ్ నమస్తే సతేతే జగత్కారణాయ, నమస్తే చితే సర్వ లోకాశ్రయాయ, నమోద్వైతతత్త్వాయ, ముక్తిప్రదాయ, నమోబ్రహ్మణే వ్యాపినే శాశ్వతాయ.

(సత్స్వరూపుఁడును, జగత్తునకు కారణుఁడును, జ్ఞానస్వరూపుఁడును, సకలలోకములకును ఆశ్రయుఁడును, ఐన నీకు నమస్కారము సమానాధికాద్వితీయుఁడును, ముక్తిని ప్రసాదించువాఁడును, సర్వవ్యాపియును, నిత్యుఁడును, బ్రహ్మమును, అగు నీకు నమస్కారము.)

2. త్వమేకం శరణ్యం త్వమేకం వరేణ్యమ్, త్వమేకం జగత్పాలకం స్వప్రకాశమ్, త్వమేకం జగత్కర్తృపాతృ ప్రహర్తృ, త్వమేకం పరం నిశ్చలం నిర్వికల్పమ్.

(నీవు ఒక్కఁడవే శరణ్యుడవు, నీవు ఒక్కఁడవే వరేణ్యుఁడవు, నీవు ఒక్కఁడవే జగమును కాపాడువాఁడవు, స్వప్రకాశుఁడవు, నీవు

ఒక్క(డవే జగత్తును సృజించి రక్షించుచు ఇచ్ఛవచ్చినద్దానిని వినాశము( జేయ శక్తిగలవా(డవు. నీవు ఒక్క(డవే అన్నిటికంటెను శ్రేష్ఠు(డవు, నిశ్చలు(డవు, వికల్పము లేనివా(డవు.)

3. భయానాం భయం భీషణం భీషణానామ్, గతిః ప్రాణినాం పావనం పావనానామ్, మహోచ్చైః పదానాం నియన్తృ త్వమేకమ్, పరేషాం పరం రక్షణం రక్షణానామ్.

(నీవు సకల భయంకరవస్తువులకును భయంకరు(డవు, సర్వభయానకములకును భయానకు(డవు, జీవులకు గతివి, పరమ పావను(డవు, నీవు ఒక్క(డవే మిక్కిలి ఉన్నతపదవులయొక్కయు నియంతవు, సర్వశ్రేష్ఠు(డవు, మహారక్షకు(డవు.)

4. వయం త్వాం స్మరామో, వయం త్వాం భజామో, వయం త్వాం జగత్సాక్షిరూపం నమామః, సదేకం నిదానం నిరాలంబమీశం, భవామ్భోధిపోతం శరణ్యం వ్రజామః.

(మేము నిన్ను స్మరించెదము. మేము నిన్ను భజించెదము. జగత్తునకు సాక్షిరూపు(డవగు నిన్ను నమస్కరించెదము. నీవు సత్స్వరూపుడవును, ఆదికారణు(డవును, అవలంబరహితు(డవును, నేతవును, పాపసముద్రమునకు నావయును, అగునిన్ను ఒకనినే శరణు జొచ్చెదము.)

5. అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా మమృతం గమయ ; అవిరావీర్మ ఏధి రుద్రయత్తేదక్షిణ ముఖం, తేన మాం పాహి నిత్యమ్.)

(అసన్మార్గమునుండి మమ్ము తొలఁగించి సన్మార్గమును పొందింపుము. మమ్ము అజ్ఞానంధకారమువలన విడిపించి జ్ఞానజ్యోతిని పొందజేయుము. అనిత్యస్థితినుండి మమ్ము శాశ్వతపదవిని పొందింపుము. ఓ స్వప్రకాశుఁడా! మా సమీపమున ప్రకాశింపుము. ఓ దుఃఖనివారకుఁడా! నీ కరుణ యను ముఖముచే మమ్ము సర్వదా కాపాడుము.)

ఓం తత్సత్.

(ఇచ్చట తత్త్వోపదేశరూపమయిన యొక బ్రాహ్మగీతమును పాడినపిమ్మట, ఆచార్యుఁడు బ్రాహ్మధర్మ గ్రంథమునందలి జ్ఞానకాండమునను కర్మకాండమునను కొంతభాగమును చదువవలయును. తరువాత ఆచార్యుఁడు కోరినేని ఉపదేశరూప ప్రసంగము చేయవచ్చును.)

## అనుతాపము

అత్యంత కారుణికుఁడ వయిన యో పరమాత్ముఁడా! పాపాత్ములము అగు మేము నీ మితిమీఱిన కరుణామహిమమును ఇంచుకేనియు ఎఱుఁగనివారమయి, అనిత్యమయిన యీ ప్రపంచమును నిత్యమని భ్రమగొని తలఁచి, జ్ఞాననేత్రమును పోఁగొట్టుకొనుటచే కన్నుగానని

వారమయి, గర్వభూయిష్ఠులమయి, కేవల ప్రాకృతేంద్రియములను తృప్తిపరచు పామరకార్యములయందే చరించుచున్నారము. మాహృదయములు పాపములచే కప్పబడియున్నయవి. నీ దివ్యతేజమను జ్ఞానసూర్యుఁడు కామక్రోధాదులను మేఘములచే మాకు మఱుఁగయియున్నాఁడు. మేము అతి దీనదశయందు ఉన్నారము. మాదశ మిగుల నిర్భాగ్యకరమయినది. మా యైహికకాలమో క్షణభంగురమయినది. మాపాపములన్నో అనంతములు. మేమో అల్పజ్ఞులమును అల్పశక్తులమును. నీవో సర్వజ్ఞుఁడవును సర్వశక్తుఁడవును. కావున నీ కరుణయొక్కటి తప్ప మాకు వేఱేదియు గతి గానఁబడదు. ఓయనుంగుఁదండ్రీ! ఇట్టిదశయందు మేము ఏమి చేయఁగలవారము? నీ శరణు చొచ్చితిమి. కాబట్టి దీనశరణ్యా! మమ్ము ఆవరించియుండెడి భయంకరములగు పాపమృగములను పాఱఁద్రోలి మా బెదరు దీర్చి రక్షింపుమా.

(ఇచ్చట అనుతాపరూపమయిన బ్రాహ్మగీతము పాడవలెను.)

## ప్రార్థన

సర్వవ్యాపి వయిన పరమాత్ముఁడా! పాపులమగు మమ్ము పావనులను కావించి మాకు శాంతియును ఆత్మపారిశుద్ధ్యమును ఒసంగుము. మాయుల్లములందు నెలకొని యుండుమరాశ మిగుల బలిష్ఠముగాను మాచుట్టు ఉండెడియిచ్ఛాకర్షక విషయములు అసంఖ్యేయములు

గాను ఉండుటచేత వానిని నీ కృపచేతఁగాక మా దుర్బలమైన ప్రయత్నములచే నివారించుటకు అశక్తులముగా నున్నారము. కాఁబట్టి నీ సన్నిధియందు శరణు జొచ్చితిమి. ఓదేవా! మేము ఎంతయు గతిలేనివార మయి నీ కనికరమునకు పాత్రులమైయున్నార మనుట నీకు తెలసినవిషయమే కావున మమ్ము కావవలసినభారము నీమీదనే ఉన్నయది.

అసత్యము, హింస, చౌర్యము మొదలైన పాపములు ఒక్కటి యును మమ్ము చేరకుండునటులు కరుణించి కావుము. ఓ యపార కరుణాంబునిధీ! నీవు ప్రేమగల తండ్రి వనియును అధిపతి వనియును తెలిసి శ్రద్ధతో నిన్ను ఆరాధించునట్లును, ఎల్ల జనులను మాతో నిన్ను ఆరాధించునట్లును, ఎల్లజనులను మాతోఁబుట్టువులని తలఁచి వారిపై ప్రేమ యుంచునట్లును, మా హృదయములను పదిలపఱుపుము. నీప్రేమయును పారిశుద్ధ్యమును ప్రతిహృదయమందును ప్రతికుటుంబమునందును మాత్రమే కాక యీలోకమునందంతటను రాజ్యము చేయునటుల కటాక్షింపుము.

ఓ యనుంగుదండ్రీ! నీ సత్యమైన పరిశుద్ధసంప్రదాయము అంతట ను వ్యాపించునటులు అనుగ్రహించి, నీదుబిడ్డలు ఎల్లవారును అ... పారిశుద్ధ్యము, ఆత్మశాంతి, మొదలగు సుఖములను పొందున... కృపచేయుము.

(ఇచ్చట ప్రార్థనారూప గీతమునైనను, మంగళమునైనను పాడవలెను.)

## శాంతిపాఠము

జగద్రక్షకుఁడగు మన పరమపిత మన ప్రార్థనలను ఫలింపఁజేసి శాంతియును పారిశుద్ధ్యమును గల యుల్లములతో మనము ఎల్లప్పుడును తనదివ్యసాన్నిధ్యమును అనుభవించునటుల కటాక్షించును గాక!

ఓం! శాన్తిశ్శాన్తిశ్శాన్తిః.

(ఇంతట ఉపాసన ముగియును.)



# ఉపదేశాష్టకము



1. అప్రమేయుఁడును, పరిపూర్ణుఁడును, సర్వశక్తుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వకారుణ్యుఁడును, సర్వపారిశుద్ధ్యుఁడును, ఐన యేకేశ్వరుని ప్రతిదినమును ఉపాసింపవలయును.

(*a*) మనుజునినైనను, మఱియేజంతువునైనను, లోకపాలకులనైనను, సృష్టికిలోఁబడిన మఱియేవస్తువునైనను, ఆరాధించుట కూడదు.

(*b*) ప్రతిమారాధనా సంబంధ మయిన కార్యములు, ఉత్సవములు మొదలైనవానియందు అన్నివిధములయిన సంబంధములను జాగ్రత్తతో నివృత్తి చేసికొనవలయును.

(*c*) ప్రతిమారాధనకు ఏ విధమునను అనుకూల్యము చేయఁగూడదు

(*d*) ప్రతిమారాధన ఈ భూమినుండి నివృత్తి యగునటులు యావచ్ఛక్తియుక్తులను ప్రయోగింపవలయును.

2. ఈశ్వరుఁడు అందఱకును సాధారణ జనకుఁడు అని యెఱిఁగి ప్రతిమానవుని సహోదరుఁడు అనియును ప్రతి స్త్రీని సహోదరి అనియును తలఁచి ప్రీతి యుంచవలయును.

(*a*) మానవులు ఏమతస్థులైనను, ఏకులమునందు పుట్టినవారైనను, ఏస్థితియందు ఉండువారైనను, వారలను విరోధించుటయు వారిని విరోధులనుగా తలచుటయు కూడదు.

(*b*) ఒకజాతిభేద చిహ్నములైనను ధరింపఁగూడదు.

(*c*) జాతిభేదమునకు అనుకూలము లయిన యేప్రయత్నమునందును, ఏకార్యమునందును చేరఁజనదు.

(*d*) ఎల్లజాతులవారును సర్వవిధవిరోధములను విడిచి యేక కుటుంబస్థులవలె నగుటకు అనుగుణమైన ప్రయత్నములను చేయవలయును.

3. సత్యముగా నడుచుకోవలయును.

(*a*) అసత్యమును ఒకప్పుడును చెప్పఁగూడదు. ఇతరులు అసత్యార్థమును గ్రహించి మోసపోయినను తాను సత్యవాది సని మెప్పించునట్లు అనేకార్థములుగల వచనములను తంత్రముగా వచింపను రాదు.

(*b*) అసత్యమాడుటకు అపేక్షింపను కూడదు.

(*c*) అన్నివిధములైన కపటస్వభావములను విడువవలయును.

(*d*) అసత్యమును నాశముచేయుటకును, సత్యమును ఉద్ధరించుటకును ప్రయత్నపడవలయును.

**4.** అందఱకును మంచిచేయవలయును.

(*a*) ఒకరికిని చెఱుపు చేయఁగూడదు.

(*b*) ఒకరికిని చెఱుపు చేయ కోరనురాదు. ఒకరి మంచిస్థితిని జూచి ఓర్వలేకయు నుండఁగూడదు.

(*c*) పాత్రమెఱిఁగి ఆహారము లేనివారికి ఆహారమును, పానీయము లేనివారికి పానీయమును, ఔషధము లేనివారికి ఔషధమును, ధనము లేనివారికి ధనమును, విద్య లేనివారికి విద్యయును, భక్తి లేనివారికి భక్తియును, లభింపఁజేయవలయును.

(*d*) మానవుల యైహికాముష్మిక సౌఖ్యములను వృద్ధిచేయఁ బూనుకొనవలయును.

**5.** ఒరులయెడల న్యాయముగా నడుచుకొనవలయును.

(*a*) ఒకరి సొత్తును అపహరింపగూడదు.

(*b*) సొత్తు కలవారి యనుమతి లేక ఒకరిసొత్తును ముట్టుకొనరాదు.

(c) ఒకరి ధనమునకును, సంతోషమునకును, గౌరవమునకును, హానిచేయఁగూడదు.

(d) ఇతరులకు చెడుగు కోరరాదు.

6. నీయందు క్షమ ఉండవలెను.

(a) కడు కీడు చేయువారికేని బదులు కీడు చేయరాదు.

(b) బదులు కీడు చేయవలయుననెడి యిచ్ఛయును కూడదు.

(c) తనకు కీడు కోరువారికిని కీడు చేయువారికిని మంచి కోరవలయును, మంచిచేయ యత్నింపవలయును.

(d) అందఱిలోపల పరస్పరప్రీతి వ్యాపించి నెలకొనునట్లును, విరోధమును, ఐకమత్యాభావమును నివృత్తి అగునట్లును ప్రయత్నము చేయవలయును.

7. మనసును స్వాధీనపఱచి యేలవలయును.

(a) తాము న్యాయముగా వివాహము చేసికొన్నవారితో తప్ప ఇతరులతో భోగింపఁగూడదు.

(b) ఎవ్వరిని మోహపుఁదలఁపుతో చూడను కూడదు.

(c) వ్యభిచారచింత స్వప్నములోనైనను కూడదు.

(d) అందరియందును మోహములేని పరిశుద్ధచింత ఉంచవలయును.

8. కుటుంబ ధర్మములను విశ్వాసముతో సలుపవలయును.

(*a*) తల్లిదండ్రులకు శ్రద్ధతో శుశ్రూష చేయవలయును.

(*b*) తోడబుట్టువులయందు ప్రీతికలిగి ఉండవలయును. బిడ్డల యైహికాముష్మిక సుఖములకై ప్రయత్నపడవలయును.

(*c*) దంపతులు పరిశుద్ధమగు ప్రేమపాశముచే బద్ధులై, కుటుంబ ధర్మములను మతధర్మములను పరస్పర సహకారులుగావుండి చేయవలయును.

(*d*) బ్రాహ్మధర్మోపదేశముల ప్రకారము లౌకికధర్మములు సలుపవలయును,



ఓమ్.

# బ్రహ్మబీజము

బ్రహ్మవా ఏకమిదమగ్ర ఆసీన్నాన్యత్ కిఞ్చ నాసీత్త దిదం సర్వమసృజత్॥

తదేవ నిత్యం జ్ఞాన మనన్తం శివం స్వతన్త్రం నిర వయవమేక మేవాద్వితీయమ్॥

సర్వవ్యాపి సర్వనియన్తృ సర్వాశ్రయ సర్వవిత్ సర్వశక్తిమత్ ధ్రువం పూర్ణమప్రతిమమ్॥

ఏకస్య తస్యైవోపాసనయా పారత్రిక మైహికఞ్చ శుభంభవతి॥

తస్మిన్ప్రీతి స్తస్య ప్రియకార్య సాధనంచ తదుపాస నమేవ॥

బ్రహ్మ మొక్కటే యాదియందుండెనుగాని వేఱేమి యులేదు. అదియే యీయన్నిటిని సృజించెను॥

అది నిత్యము. జ్ఞానస్వరూపము, అంతములేనిది, మంగళస్వరూపము, స్వతంత్రము (గలది) అవయవము లేనిది, రెండుగాక యొక్కటైనది॥

సర్వవ్యాపి, సర్వనియన్త, అన్నిటికాశ్రయమైనది, సర్వజ్ఞతయు, సర్వశక్తియు గలది, ధ్రువమైనది, పూర్ణము, సమానములేనిది॥

దాని నొకటిను పాసించుటచేతనే ఐహికాముష్మిక శుభములుకలుగుచున్నవి॥

దాని యెడల ప్రీతియు దానికి ప్రియమైన కార్యములసాధించుటయు దాని ప్రార్థించుటయే యగును॥

ప్రాతః స్మర్తవ్యమ్

ప్రాతఃకాలమున స్మరింపఁదగినది.

---

శ్లో॥ లోకేశ చైతన్య మయాధిదేవ మాఙ్గల్య విష్ణో భవాదాజ్ఞయైవ హితాయలోకస్య తవప్రియార్థం సంసార యాత్రా మనువర్త యిష్యే॥

**తా॥** ఓ పరమేశ్వరుడా! నీయాజ్ఞచేతనే నేను ఈలోక హితము కొఱకు, నీ ఇష్టముకొఱకు, ఈజనన మరణ రూపమైన దేహమును సంసారమును అనుసరించుచున్నాను.

## సర్వదాస్తుతింపదగినది

ద్విపద॥ పురుషోత్తమా! మహాపురుషుండవైన
కారుణ్యఘనునిన్నె కనియలవడియు;
సృష్టిలోపలివాని సేవించునట్టి
కష్టంపుమతినాకు కలుకగకుండగను
సత్యమౌమార్గంబు చనునట్లుగాను
నిత్యంబు నామది నెగడింపుమయ్య;
సంకేతమైనట్టి సకలకర్మముల
సంకులంబులవిడిచి సకలంబునకును
ఏకనాయకుఁడవై యెసగెడునిన్నె
ఒక్కనిశరణము నొందితిమయ్య;
దాసుల పాపంబు తగులంగనీక
భాసుర కృపతోడ పాలింపుమయ్య. ఓంతత్సత్.

## ఉదయవందనము

పంచేంద్రియంబులు పనులను విడువ
మించెడు కరణముల్ మెరయకయుణగ

నిద్దురబోయెదు నిశిలోన నేను
పెద్దయా కరుణతో పేదయానన్ను
ఆదయంటక యరసినదేవ !
వ్యాపారములచేత వాడినవారిక
చర్మంబు మొదలగు సకలేంద్రియములు
నిర్మించి సుఖియింప నిద్రనుమాని
మా వెల్లకీడేది నులగంగనీక
కాపాడి ప్రొద్దున కందకపడక
యుండ నేలేవగా నొనరించినట్టి
నుండితకరుణాబ్ధి మనసారనాదు
దేహంబు పులకింప దేవరవారి
మహిమంపు టడుగుల మస్తకంబొప్ప
దాలిచిచేరితి వందనంబిదిగో
వాకిలు, ననుగన్న కృపబాలింపుమయ్య. ఓంతత్సత్

## సాయంకాల వందనము

కారుమేఘంబులు కడంగి వర్షించు
తీరునదాసుడౌ దీనునిపైని
కరుణాప్రవాహంబు కలయంగబరపు
బరమదైవమ యీశ బ్రహ్మాంబ నేను

జీవించువాళ్లలో చెల్లగనొకడు
దివసంబు సంధ్యయై తిరుగంగ రాత్రి
సమకూరె నానందసమయంబు కొలువ
తమపాదపద్మముల్ దాసుఁడు నేడు
చెందినసౌఖ్యముల్ చేసినయట్టి
పొందికకార్యముల్ పొలుపొప్పతమదు
కారుణ్యమునగాదె కలి7ను దీని
సార్వకాలంబును సరియైనభక్తి
కొనియాడ దయచేసికొనురప్పచెనటి
పనులను నావాని పరగమన్నించి
నిర్మలచిత్తత నిన్నె వేనమ్మి
యూరట జెందంగ నొసఁగుముశయ్య;
ఈనిద్ర నేశేవ నిలనుంటి నేని
నానూత్న కార్యముల్ నయమొప్పనీకు
నప్పనమొనరింతు నటుగాక ఇదియె
తెప్పననాయంత్య దినమయ్యె నేని
చెడనియాపదలో చిరుతకొకింత
యెడమిచ్చి కావుమీ యెటులైనదాసు. ఓంతత్సత్.



# పీఠిక

బ్రాహ్మగీతములు; ఉద్బోధనము, స్తోత్రము, వందనము, ధ్యానము, అనుతాపము, ప్రార్థన, తత్వోపదేశము, ధర్మోపదేశము, పాడువు, మంగళము అను పదిభాగములుగానున్నది. ఉద్బోధనమునకు విషయము బ్రహ్మోపాసనను అరంభించుటకు పురికొల్పుట. స్తోత్రమునకు విషయము భగవంతుని అపరిమిత జ్ఞాన శక్తులను, అతని సృష్టియందలి విచిత్రములను బయలుపఱచి పొగుడుట. వందనము అతని యపారకరుణను అతని సృష్టిలోని సదుద్దేశముల మూలముగా వివరించి కృతజ్ఞతను తెలుపుట. ధ్యానము దేవుని ఆత్మయందు దర్శింప యత్నించుట. అనుతాపము మనపాపములను తలంచి దుఃఖించుట. ప్రార్థన అట్టిపాపములనుండి నివర్తియైన పరిశుద్ధమైన హృదయమును పొందుటకు జ్ఞానబలమును, ధర్మబలమును, ప్రసాదింపుమని దేవునివేండుట. తత్వోపదేశము అభిప్రాయవిషయమైనది. ధర్మోపదేశము అనుష్ఠానవిషయికము. మంగళము వేదములలోని శాంతిపాఠముల వంటి అభిప్రాయములు కలవి. పాదువు ఈతొమ్మిది భాగములలో నణంగనివి. ఇందు ఉద్బోధనము, ధ్యానము, వీటికిలక్ష్యము సామాజిక ఉపాసనయందు కూడియుండుజనులు ఏకాంత ఉపాసనలో వారివారి హృదయము, స్తోత్రము, వందనము, అనుతాపము, ప్రార్థన వీనికి ఏకాంత ఉపాసనయందును, సామాజిక ఉపాసనయందును, లక్ష్యము దేవుఁడు.

ఓమ్

బ్రహ్మణేనమః

# బ్రహ్మగీతములు

## ఉద్బోధనము

సౌరాష్ట్రరాగము - ఆదితాళముచాపు.

పల్లవి

1. బ్రహ్మము నెప్పుడు భక్తిని గొలిచిన పాపపుంజములు పాఱవే

అనుపల్లవి

బ్రాహ్మల గోష్ఠిని బాయక యుండిన బహుశుభములు చేకూఱవే

చరణములు

కల్లలుపలుకుట మదిలోఁ ద్రోసి కామ క్రోధాదులఁ దెగఁగోసి
యుల్లమునెంతయుఁ బదిలముచేసి యూహాపోహలఁ గవిడఁదీసి
దుష్టుల నేస్తము చేయుటమాని దూషింపని గుణముండఁగబూని
కష్ట కాలమున నెమ్మదిపూని కలిమి లేములను సమముగనాని
చిఱుసుఖముల నెల్లనువిడనాడి పరసుఖములదియ సేయఁగవేఁడి
పరిశుద్ధాస్తిక మతమునుగూడి పరమపితను మదిలోఁగొనియాడి.

## ఉద్బోధనము

తోడిరాగము - చాపుతాళము.

పల్లవి

2. సేవింపరారే మాస్వామిని సేవింపరారే

అనుపల్లవి

భావాతీత పరబ్రహ్మ స్వరూపుని

చరణములు

1. భూవిభవములను బూని మోహము మీఱి
కావించు బహుదుష్ట కర్మతతులు దీఱ
పావనులయి మోక్ష పదవియుఁ జేకూఱ
పావన చరితుని భక్తితో నింపాఱ.

2. ఆమహా మహిముని యాశ్రయమును బూని
కామాది బాధల ఖండించి వృత్తిలేని
ఆముష్మి కానంద మందు కొందురుగాని
తామసములు మాని తఱలి వేగమె వాని

3. అపరాధ కోటుల నాచరించెడు వాని
నెపముల నెన్నక నిత్యశుభము లీని
కృపతోడఁ బోషించు కూరిమి తండ్రిని
అపరిమిత ప్రీతి నెపుడు చిత్తమందూని

## ఉద్బోధనము

ఆనంద భైరవి రాగము - త్రిపుట తాళము.

పల్లవి

3. ఆనంద మానంద సుబ్బయ్యుని భజన.

అనుపల్లవి

ఆనంద స్వరూపుని నాత్మందలచుతే భువిని.

చరణములు

1. నిత్యనిర్మల విభుని నిఖిల లోకేశుని
సత్య స్వరూపుని సంస్తుతించుటే భువిని.

2. ఎవ్వండీ భూతముల యేలికై యున్నవాండు
ఇవ్వసుధవాని నీశ్వరుండని పొగడ.

3. ఎవనిలో భూత జాల మెల్ల నణంగి యున్నదో
అవనివాని నుతించి యతిభక్తినుతిందలంప.

4. సర్వ భూతేశ్వరుని సదా సత్య ప్రభుని
గర్వ శిక్షా పరునిం గడుంభక్తినదింగొలువ.

# ఉద్బోధనము

శహానరాగము - త్రిపుట తాళము.

పల్లవి

4. ఎవ్వఁడీ సూర్యాదుల నేమఱక నడపు
నవని వాని భజింతమా మదిఁదలంతమా.

అనుపల్లవి

సవినయముగ వాని సద్భక్తిఁగొలిచిన
సామ్రాజ్యముల నిచ్చుఁగా ఇల హెచ్చుఁగా

చరణములు

1. సర్వాత్మకుఁ డతఁడు సర్వేశుఁడాతఁడు సర్వమందుండువాఁడు
ఉర్వీజనుల కెల్ల నుద్ధారకుం డతఁడే యూర్ధ్వలోకముల కతఁడే
సర్వము తనదై పరఁగు సచ్చిదానందుని
సదా చేరి కొలుతమా మదిఁదలఁతమా.

2. ఈచరాచరముల నెల్ల సృజియించు నతఁడు లోకాతీతుఁడు
భూచక్రము మొదలౌభువనములందెల్ల బూర్ణుడైయుండువాఁడు
అచలేంద్రియములచే నధికుఁడౌనట్టి వాని
ననుదినముంభజింతమా మదిఁ బ్రార్థింతమా.

3. ఎవనికిలోఁబడు నీ మహాసముద్రము నెవని హుంకృతికి వెఱచు
నెవనిచేనగ్ని వెలుఁగు నెవనిచే గాలివీఁచు నెవఁడు వానకురియఁజేయు
బ్రవిమలుఁడగునట్టి బ్రహ్మస్వరూపుని
భక్తిఁజేరి కొలుతమా మదిఁ దలఁతమా.

## ఉద్భోధనము

ద్విజావంతి రాగము - రూపక తాళము.

పల్లవి

5. పాడరే పరమేశు స్తుతిని బరమ సంతోష
మునను అనుదినమును

అనుపల్లవి

వీడరే భువిలోను విషయాదులనెల్ల కూడరేమీరిలఁ గోరిక వేడరే

చరణములు

1. నేదం యదిద ముపాసతే యన నేమిటో కనరే
సాదరముగఁ గాచు సర్వేశుఁడుండఁగ
వ్యర్థ కర్మముల వెతల నొందఁగ నేల

2. ఎవ్వాడే భూతంబుల సృజియించి యెందునలరి యుండునో
ఎవ్వనిలో సూర్యాదులెల్ల లయింతురో
అవని వానిమీర లతిభక్తిఁ గొలువరే

3. ప్రాణమునకుఁ బ్రాణమగు వానిఁ బరుని సత్య వ్రతుని
వీణా మృదంగాది వివిధ వాద్యములచే
విభుని నామముల వేడుక నుడువరే.

## ఉద్బోధనము

బ్యాహాగ్ రాగము - ఆదితాళము.

6. భజపరబ్రహ్మ భజపరబ్రహ్మ భజపరబ్రహ్మ సర్వగతం॥

1. సంప్రాప్తేసన్నిహితేకాలే రక్షతిరక్షతి నానమిదం॥

2. ఆశామోహం సర్వంత్యక్త్వా భజబహువర్ణం పరమేశంత్వం.

3. సక్తాఃకామిత బ్రహ్మానందం దాస్యతితుభ్యంనానమిదం.

4. పురుషాధీనంకించి న్నాస్తి బ్రహ్మాధీనం సర్వమిదం.

5. శక్తిఃకారణ పురుష స్యాస్తి జగతివిచింతయ తత్వమిదం.

---

# ఉద్బోధనము

జంఝూటిరాగము - ఆదితాళము.

పల్లవి

7. అందఱుఁగూడి యీ నందుని భువిలో
అందముగాఁ గొని యాడుద మెదలో

అనుపల్లవి

సందియముల నిఁక డెందంబుల లేక
ఎందునఁజూచిన పొందియుండువిభు.

చరణములు

1. దురభిమానముల నటు వైచెదమా దుశ్చింతలపట్టును వదలుదమా
సరగున శరణుని సామిననెదమా సారిసారివానినె దలఁచెదమా.

2. లోకమందు స్నేహముగాదా వీఁక వైరములు కల్గుటలేదా
ఏక నాథుఁడై ఏమఱకను బలులోకములకుఁ బెనుప్రాగువానిని

3. దుష్ట చర్యలను దొలఁగఁగఁబెట్టి కష్టచిత్తముల కడలకుఁదట్టి
నిష్ఠతోడ నిఁక నీశ్వరుఁడిట్టి సృష్టికర్తయని మదిలోఁబెట్టి

4. బ్రాహ్మసమాజముఁ బ్రోచెడువానిఁ బ్రభుని నిత్యనిభక్తితోఁ బూని
స్నేహితుడును సామియునౌ వాని సతముసన్నుతింతమిఁక వీని.

# ఉద్బోధనము

కేదారిగౌళరాగము - రూపకతాళము.

పల్లవి

8. నమ్మి జగన్నాథుఁగొల్వరే

అనుపల్లవి

ఓ జనులారా !

చరణములు

1. నమ్మినసేవమ్ముగలదో నమ్మకయున్ననుగలదో నెమ్మనమున
నిరూపించి యిమ్మహినెల్లెడహితముఁగాంచి॥

2. ఇమ్మహిశోధింపఁగనొకసామ్మ దొరకు నందునొకఁడు నమ్మ
వలదు లేదటంచునరుఁడొకఁడనా॥

3. ఈమాటలలో మొదటిది నమ్మినడచుచో నొక పత్తుమ్మనలాభ
మ్ముగలదు గాంచిచూచినఁ॥

4. నమ్మనినమ్మక చనలేశమ్మైనను గలదే హితము నెమ్మి మీఱు
నటు గావున సమ్మతించిపరమార్థము॥

# స్తోత్రము

హుసేనిరాగము - రూపకతాళము

పల్లవి

9. సర్వలోక జీవరక్షకా ! ఓ ఓ ప్రభు !

సాధుజన గణైక పక్షకా !

అనుపల్లవి

దుర్విక్లేశము లోర్వజాలము ఓరి కృపాకర ! చేర్చి సమ్మేళ్లుము

చరణములు

1. సత్యకామ ! సత్యవర్ధనా ఓ ఓ విశుద్ధ !
సకల సద్గుణ ప్రవర్తనా !
నిత్యానంద ! మోక్షదాయక !
నిఖిల భక్తప్రమోద సంధాయక !

2. చాల నోచ్చి వచ్చినారము ఓ ఓ కృపాళు !
జాలమైన తాళనేము ;
పాల ముంచిన నీట ముంచిన
భారము నీదే దయారస వారిధీ !

# స్తోత్రము

3. నిన్ను నమ్మి యున్న వారము ఓ ఓ * ముకుంద!

నివారింపుము మాదు నేరము;

సన్నుత ప్రభావ! నీవ

సద్దఁ జేసిన నేది త్రోవ.

4. పుత్రవాత్సల్యకుఁడు కావకో ఓ రోరి తండ్రి

బుద్ధి తెలిపి కావ రావకో;

చిత్రమును పవిత్రమునగు

చేతల నొందను ఖ్యాతి వహించిన.

---

* ము = ముక్తి, కు = ఐహిక సౌఖ్యము, ద = ఇచ్చువాఁడు.
అనగా ఐహికాముష్మిక సుఖంబు నిచ్చు పరబ్రహ్మంబని యర్థము.

# స్తోత్రము

సావేరిరాగము - చాపుతాళము

పల్లవి

10. ఎంతటి కారుణ్యుఁడే పరమాత్ముఁ డెంతటి కారుణ్యుఁడే

అనుపల్లవి

సంతతము పుత్రవాత్సల్యతను మఱువక
సంప్రీతిని బ్రోచునే మనసా !

చరణములు

1. ఎందునుగలవాఁడే యెల్లబలిమికాఁడే
డెందంబునకైన నందనివాఁడే
పొందినవారలకా నందమిచ్చు సత్తముఁడే
వందనములఁజేకొ నందగునుత్తముఁడే.

2. అరయఁగ చిదచిన్ మందిరమునఁ గలవాఁడే
వర భక్తజన మనో హారుఁడై వెలయువాఁడే
కరమను రక్తిని గాచు తండ్రియౌవాఁడే
తిరముగ నిమ్మనఁ దిరుగ రానివ్వఁడే.

3. పరమ పురుషుఁడే వర సత్య భాషుఁడే
శరణాగతిపోషుఁడే చల్లనివాఁడే
సురుచిర కరుణాది శుభగుణ జాలుఁడే
నిరుపమ మహనీయ నిర్మల రూపుఁడే.

## స్తోత్రము

కమానురాగము - ఆదితాళము

పల్లవి

**11.** నీవే గతియని నమ్మితిమి సుది నిఖిల కలుష హార !

అనుపల్లవి

ఈ వసుధను నినునెప్పుడు కొలిచిన
కావరాఁగదవే కరుణా సాగర !

చరణములు

1. సర్వ సృష్టిమయ సర్వాత్మక మహేశా ! ఈశా !
సర్వ భూతసమ సచ్చిదానందా !
సర్వసుఖప్రద ! సర్వాంతక ! పర !
శాశ్వతాఘపరిశమన ! సతతమును.

2. కన్ను కాలు మొదలగు నవయవముల కీశా ! మహేశా !
కన్ను కాలు గానుండు మహేశా !
ఎన్నరానినీ యున్నత గుణములు
సన్నుతించుటకు సాధ్యమవునె యిల.

3. ఇన చంద్రాదుల నిలమాకిచ్చిన ఈశా ! మహేశా !
అనయము మముఁగాచెడి సర్వేశా !
తనయులమగు మము దయతోఁ బ్రోవుము
దాస పోషకా ! దయారస జలధి !

# స్తోత్రము

**12.** కందార్థము - మోహనరాగము

సదయుఁడవగు నినుభువిలో। నెదఁదలఁచినవారి కెల్ల నెంతయు సుఖముల్ పదిలముగ నిత్తు గావున । సదసద్వివేక నిన్నె సంస్తుతించెదము। గతినీవని మదినిదలఁచెదము - సదమలరూప సచ్చిదానంద నిను-వదలక గొలిచెదము వాత్సల్యముతోడ - సంస్తుతించెదము.

**13.** కందార్థము - శంకరాభరణరాగము

ఎవనికి జగములు వడకును । నెవనికిఁ దపనుండు గాయు నేనికి వెరచుఁ - భువినిట్టి వానిమదిలో । సవినయముగ భక్తిఁ గొలిచి సంస్తుతించెదమా - సచ్చరితలఁ గొట్టివైచెదమా - ప్రవిమలుఁడగు నట్టి బ్రహ్మస్వరూపుని - సవనిఁ గొలిచినంగలుగు నలవడని సుఖము - సంస్తుతించెగమా.

**14.** కందార్థము - శంకరాభరణరాగము

పటుతర బలుఁడగు నీవిల । నెటఁ జూచిన నచటఁ గోఁచు టెఱుఁగక మనుజుల్ । దిటవుగ * గాశికిఁ బోదురు । కటకట యెఱుఁగమిని గాదె కారుణ్యనిధీ । మమురక్షించు కరుణాంభోధి । ఇటనట నెడలేనిచటుల సత్వముతోనె । ప్పటికి వెలసియుందువఁటయిల నన్నిట। అటుల మెఱసెడు నిన్నె దిక్కని దిటవుగను నమ్మనుజాలును । అట మటమ్మని భయములేదిఁక కుటిలమతులిది దెలియఁబోరిల । కారుణ్యనిధీ । మమురక్షించు కరుణాంభోధి॥

---

* వ్యాపకోయది భవేత్పరమాత్మా, మామకమ్ నగరమేవహి కాశీ అను ఆదిశంకరుల శ్లోకార్థమును ప్రతిపాదించుచున్నది.

# స్తోత్రము

తోడిరాగము- ఆదితాళము.

పల్లవి

15. ఏమందునయ్యా ఓమహాత్మ నిన్నె

అనుపల్లవి

నామరూప పరిణామము నీయెడ లేమిఁజేసి నీనామము గన లేమే

చరణములు

1. స్వామివైన నిను జడరూపుఁడవని లేమవనియు ననలేము సదా।
కామమోహములు నామొదలగునవి లేమినయుఁడవన లేముగదా॥
2. ఎందును నీవఁట నేదియుఁ గావఁట కామితార్థములు గలుగు ఘనుఁడవఁట।
3. నీమహిమము గన సామర్థ్యము మాకేమియు లేదని యెఱుఁగ లేక నుతిని॥

ఖమాజురాగము - రూపకతాళము

పల్లవి

16. చింతసేయ నేనెంతవాఁడనే !

అంతమందు నరయరాని వింతవింత లైనపనులు

నెంతేసి యొసఁగఁజేసి యంతట వర్తిల్లు నిన్ను !

## స్తోత్రము

### చరణములు

1. పంతగించి తిరిగిన నొకఁడంతయుఁ గనలేమిచేఁ ననంత
యనెడు పేరుధరణినీకమరెఁ గాదె!
2. అంతరిక్షమందుఁ జూడనింతకన్న నెక్కుడైన వెంతలేని
చుక్కలున్న వెంచిచూడఁగా!
3. అంతకున్నతి యంతలుగల వంతయుని సుమంతులైన బం
ధులకలెఁ బరగించు ననంతమైన నీదుమహిమ.

### శుద్ధసావేరిరాగము- ఆదితాళము

పల్లవి

17. విన్నవించుటకు విచిత్రముగాక యున్నదొక్కటీ నాకున్నదే!

అనుపల్లవి

ఎన్నరాని మహిమోన్నతిగల నీవన్నియు
నింతకుమున్నె యెఱుగుదువఁట

### చరణములు

1. కన్నులు మొదలగు కరణంబులు మాకెన్ని యున్నవవి యిచ్చితివీవె
చెన్నగనెపుడును కెడకుండఁగనవి తిన్నదనంబునందేరఁగనీ.
2. వేమున్న మున్న యానున్నను మిన్నను మిన్నదనంబున వెలయం
జేసితఁట, అన్నిటనీవై యున్న వాఁడవఁట కన్నతండ్రివను కరుణఁ
జూపుచుని.

## స్తోత్రము

దేశీయదర్బారురాగము - ఆదితాళము

పల్లవి

18. గతియని తలంచితే కల్గునే భయము.

అనుపల్లవి

పతులకుఁబతి యీజీవులకు జీవి దేవతలకు పరమ దైవతమైనతఁడే!

చరణములు

1. అతనికిఁబతి యీక్షితి నతిశయుఁడును బ్రతియును హితయును వెదకిన లేరు !

2. శ్రుతులనీతని శక్తినుతి కృతిబలము లద్భుతములు సహజముల తులితములైతగు !

3. సతఁడతనుండతఁ యుండకరణుండత డింద్రియపతి జగతికినధిపతి కారణమని శ్రుతుఁడగునతని న్నుతియించుటయే హితము మనకతఁడు.

## స్తోత్రము

శాహానరాగము - రూపకతాళము.

పల్లవి

19. ఎంతవాఁడవయ్యా నీవెంతవాఁడవయ్యా.

అనుపల్లవి

వింతయైన నీమాయ జంతరంబులో నన్ను బంతివలె దగిలించి యెంతో గంతులు వేయింతువయ్యా.

చరణములు

1. భూగోళమునను న్న భూతంబులు భూధరైకభాగమందు చీమలనఁగ బరగియున్నవి!

2. ఈ గోళమొక చీముగా గణింపఁదగిన తారాగణముల గ్రహముల నొకవేగమున రచించినావు.

భైరవిరాగము - రూపకతాళము.

పల్లవి

20. జయదయానిధే హేదేవ!

అనుపల్లవి

స్వయమిదం జగదఖిలంనియమయన్ నిజబలేన!

చరణములు

త్వయిభక్తిం ధారయతో నయసి నానాశుభనిధియః ప్రభో దయసినః!

స్వయంజ్యోతి రయిత్వమసి!

# స్తోత్రము

జంగ్ఝూటిరాగము-చాపుతాళము.

పల్లవి

21. సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ ఆనందామృతరూప శివం॥

అనుపల్లవి

నిత్యంశుద్ధమపాప నిరామయనిరతం నిన్నునుతించెద॥

చరణములు

1. అచ్యుతపూర్ణాద్వైత జగన్మయ తేజోమయభరితా।
సచ్చిత్సుఖమయశాంత నిరతిశయ కరుణామయచరితా॥
2. పావనసుగుణ గణాన్వితనిర్గుణ దేవనిరావరణ।
భావనిరంగ పరాత్పరజీవాధార దయాభరణా॥
3. నిరుపమ పరమేశ్వర పరమాత్మపరోక్ష పరబ్రహ్మ।
పరమానంద కృపామృతముతో అనవరతం పాలించుమయ్యా॥

పంతువరాళిరాగము - ఆదితాళము.

పల్లవి.

22. భజరే పరమేశం! సతతం! భజరే పరమేశం॥

అనుపల్లవి

సుజనాధారం। అజవిస్తారం।
సుజనోద్ధారం॥ నిజగంభీరం॥

## స్తోత్రము

చరణములు

1. సుగుణవిశాలం అఘగుణనాశం।
   జగసువిలాసం ! మిగదయకోశం।

2. కారణరూపం ! సారసుదీపం।
   ధీరకలాపం ! భూరిప్రతాపం॥

3. మరణవిదూరం ! పరసువిచారం।
   నిరుపమసారం ! జరితమపారం॥

4. సురుచిరగమ్యం ! పరతరధర్మం।
   గురుతరమర్మం ! వరపరబ్రహ్మం॥

కేదారగౌళరాగము - ఆదితాళము.

పల్లవి

23. ఏకమేవా ద్వితీయం ! నిరామయం ! శ్రీకరామృత నిలయం.

అనుపల్లవి

భీకరమితహార ! లోకాళీశ్వర

చరణములు

1. నిరుపమనిశ్చల। పరతరనిర్మల।
   నిరతిశయవిలాస। నిరఘజగత్పాల॥

## స్తోత్రము

2. నిరుపధినిర్ణయ । పురుషోత్తమవ్యయ ।
నిరుపాధినిర్మయ । పరమజగన్మయ॥

3. ధరయఖిలాదిప్రాణ । పరిపరిపోషణ ।
వరవిశ్వనిర్మాణ । పరబ్రహ్మకారణ॥

దేశకాపి రాగము - ఆదితాళం.

పల్లవి

24. కరుణాప్రసార ! కారుణధీరా॥

అనుపల్లవి

మరణవిదూర పరమవిచార.

చరణములు

1. పావనశీల దేవవిశాల ।
భావవిలోల జీవనుపాల॥

2. తాపసహృదయ పాపాఘవిలయ ।
రూపరహితమయ తాపహరవిజయ॥

## వందనము

విరాళిరాగము - ఏకతాళము.

పల్లవి

25. వందనము లివిగో సజ్జన వంద్యా! వందనము.

అనుపల్లవి

వందిత సజ్జన మనోనాథ! మమ్మేలుఁ నీకు.

చరణములు

1. దేవాది దేవునకు దివ్యాను భావునకు
స్థావర జంగమాది సంస్థాపకునకును
భావాతీతునకు భక్తాళి సేవ్యునకు
వావిరి యెన్నఁగరాని వందనము లాచరింతుము.

2. దిక్కు మమ్ముఁ బ్రోవ నీవొక్కరుఁడ వంచును
మక్కువ నెదని న్నమ్మామ్మటికిఁ దలఁపఁగ
నక్కఱయింతైన లేక యాపదలఁ శాపకను
అక్కటా! యుపేక్షింప నగునే కరుణాంబుధి.

3. కామిత ప్రదుండవని కానక మేనున్యగతిని
నేమమున నిన్వేఁడఁగ నీకు దయరాదాయెను
మామనోంబు జాతముల మడిఁచి కట్టివైచి నీకు
వేమఱు నిత్యమువందన విధులఁగావింతు మెట్లు.

## వందనము

తోడిరాగము- చాపుతాళము.

పల్లవి

**26.** వందేహం పరబ్రహ్మ! సదా వందేహం పరబ్రహ్మ!

అనుపల్లవి

నంద కంద మద్వంద మాక్రందం.

చరణములు

1. సగుణ నిర్గుణ వికాసం సర్వేశం.
సచ్చిదానంద రూపం అరూపం.

2. జనన మరణ రహితం సుచరితం.
సర్వశక్తి రంజనం నిరంజనం.

3. భవ భయ వార మచ్యుతం శాశ్వతం.
పాలితాఖిల జీవం ప్రభావం.

4. విబుధ జనాను మోదం నిర్వాదం.
వివిధ వేద చోద్యం అనాద్యం.

5. శ్రిత హృత్తాప హరణం వితరణం.
చిత్సుఖాది దాయకం నాయకం.

6. శిష్టజనో హర్షణం సుదర్శనం.
సృష్టిత సచరాచరం పరాత్పరం.

# వందనము

భైరవి రాగము - ఆదితాళము

పల్లవి

27. చరాచరాత్మక జగధీశంత్వా పరాత్పరం త్వాంప్రణమామి॥

అనుపల్లవి

పరాణపూరుష మిదమానందం । వితరాసుకృపా జలధేత్వం॥

చరణములు

1. యదాస్మరామి త్వాంలోకేశం తదామనోమెసర్వత్ర।
భ్రమత్యహో తన్నే శేబంధుం।
సమగ్రమా దేహిత్వంమాం॥

2. భ్రమణాన్మనసో నిగ్రహసామే । నశ్యతితస్మాత్ భువనేవ।
యథాదృఢం స్యాత్త్వత్పాదాబ్జే।
తథాతనుత్వం హృదయంమే॥

3. కరుణాజలధే । సర్వంమామకం దురితందూరీ
కురుభగవన్ । సదాభవత్పదకమలాసక్తం।
ముదావిధాయత్వంసాహి॥

# వందనము

4. అనాదినిధనస్త్వం సర్వజ్ఞో ప్యనాథ మేనవం
నావైషి । అజస్రమేవత్వమ్మేశగణం।
తదీశమాం మాపరిభూస్త్వం॥

5. అపాదహస్తో ప్యమేయకర్మా ప్యచక్షు రఖిలద్రష్టాత్వం
అకర్ణజిహ్వో ప్యఖిలశ్రోతా।
వచోవిదామసి పర్యశ్చ॥

6. అపరిజ్ఞేయో । ప్యఖిలాజ్ఞాతా మనోవచోభ్యాఽపిదేవ
అవర్ణనీయ స్వరూపతస్మా।
న్నమోనమస్తే సర్వాత్మనే॥

---

# వందనము

ఆనంద భైరవి రాగము - అటతాళము.

పల్లవి

28. సత్యస్వరూపాయనమః నిజ నిత్యానంద లోకేశ్వరనమః
సత్యస్వరూపాయనమః।

అనుపల్లవి

ప్రణవఘోషితగుణనమః । విశ్వఅణుమహత్తూర్ణవిశ్వేశ్వరనమః॥
గుణానిర్గుణాత్మాయనమః । గణభువనాదివందితపదనమః।

చరణములు

1. జగదాదిదేవాయనమః ! సర్వ । జగత్పరిపూర్ణపరా
నందనమః॥
భగవన్నిరాకార నమః ! బహు । నిగమవిలాసవిభూ
తయేనమః॥

2. ఈశ మహేశాయనమః! జగ । దీశపితా మహాపర
మేష్ఠినమః॥
క్లేశవిదూరాయనమః ! భవ । నాశ పరేశ పరబ్రహ్మ
నమః॥

# వందనము

ఝంఝూటి రాగము - రూపకతాళము.

పల్లవి

29. వందనం సదా నంద దేవతా ఆనంద దేవతా।

బంధదూరభర్గ సర్వలోకవందితా॥

అనుపల్లవి

సగుణనిర్గుణాకార సకలజగన్మయం।

నిగమఘోషనిఖిల భూతసయనిరామయం॥

చరణములు

1. విశ్వనాథవిశ్వభరిత విశ్వభువన విరచితం।

విశ్వరక్షవిశ్వసాక్షి విశ్వనమిత శాశ్వతం॥

2. సర్వధర్మభూషణ ప్రమాణప్రాణపోషణ।

సర్వలోకమాత పితా పరబ్రహ్మకారణా॥

# వందనము

హిందూస్థానికాఫి రాగము - రూపకతాళము.

పల్లవి

30. ఆనందామృత నమః । బ్రహ్మానం దామృత నమః॥

అనుపల్లవి

మానసమందిర ధ్యానాభిముఖసం। ధానసుమహానూత్నవత్ప్రదనమః॥

చరణములు

1. భర్గనిరామయనమః! ముని । వర్గాధిపమాననమః।
స్వర్గాలయనిరవయ వతిశయసుఖ!
దుర్గసుబోధయనమః॥

2. సారనిరాంతికనమః! దుర్ఘోరదోషహారనమః।
పారమార్థ విశ్వాభిరామశివ।
ఘోరలోక విశ్వంభరనమః॥

3. దేవనిరంజననమః! సద్భావసదాశ్రయనమః।
జీవజగన్మయా నంత దయామయ।
పావనపరబ్రహ్మాత్మకనమః॥

## ధ్యా న ము.

హిందూస్థాని కాఫీ రాగము - అటతాళము చాపు.

పల్లవి

31. మానస * రాముని ధ్యానించి మనుఁడీ

అనుపల్లవి

మది నెప్పుడు నెమ్మదిఁ జేకొనుఁడీ

చరణములు

1. చింతల మాని స్థిరమతిఁబూని
సంతతమును వాని చరిత నూఁకొనుఁడీ.

2. పాపము చనఁగా భక్తి మేకొనఁగా
పరమ దయాళునిఁ బ్రాపుఁ జేకొనుఁడీ.

3. వానిఁ బొందకయున్న వసుధలో నెన్న
రాని బాధలను మీఱఁగలేము వినుఁడీ.

4. నిరవధిక ప్రేమా నిధియనినమ్మి
శరణముఁగొని నిత్యసౌఖ్యముఁ గనుఁడీ.

5. * నారాయణ ! జగన్నాథ ! మహేశా !
కారుణ్యమయ ! మమ్ముఁగావుమి యనుఁడీ.

---

* రాముఁడు_ఆత్మలకు ఆనందము ఇచ్చువాఁడు.
* నారాయణుఁడు_సర్వభూతనివాసియై యుండువాఁడు.

## ధ్యానము

హిందోళరాగము - ఆదితాళము.

పల్లవి

32. నిత్యానందమయా నిన్నే దలంతు !

అనుపల్లవి

సత్యానంద జ్ఞానాకల్ప । సత్యకామ యోసత్యసంకల్ప॥

చరణములు

1. అత్య తాశ్చర్యామిత వికల్ప సత్యలోకకల్పనశిల్ప !
భృత్యభూత వరుణేంద్రసమీరా !
దిత్యాద్యృత్యుముఖ దేవ యనల్పా॥

2. శ్రుత్యంతశ్రుత సూక్ష్మాకారా! జగత్యంతర్గతసకలాధారా॥
యత్యంతరంగ నిత్యనికేతన గత్యంతరములులేవు గావుమింక॥

భైరవి రాగము - ఆదితాళము.

పల్లవి

33. బ్రహ్మకృపాహి కేవలం । ధర్మవిచారణం.

అనుపల్లవి

బ్రహ్మాండ కోటిసకల । పాపనివారణం॥

ధ్యానము

చరణములు

1. ధ్యానాభి సుముఖసం ధానానుభవనిజ।
జ్ఞానస్వరూప హృదయ భానుతేజోమయ॥

2. ధీరాభిధానపరమ సారసనిరుపమ।
భూరివినోదసము దారశుభోదయ॥

3. జీవాదిజగమియ దేవపరబ్రహ్మ।
భావప్రసన్నదర్శన పావనమయఘన॥

34. ధన్యాసిరాగము - అటతాళము.

1. ఆదిమధ్యాంతము లొందనివాఁడు మ। హాత్ముఁడే శేశ్వ
రుఁడు। మనస! వాదభేదము లుడిగి వానిస్మరణఁజేసి।
మోదము నొందుమిఁక॥

2. ప్రీతిఁదను నమ్మినవారికి మోక్షప్ర। దాతయే శేశ్వరుఁడు।
మనస। నీతిమార్గము విడక నిజభక్తి సేవలుక। ఖ్యాతి
వాని భజింపవే॥

# ధ్యానము

3. కరుణాసముద్రుఁ డర్థులకుఁ బాపులకు భీ। కరుఁడౌ నే కేశ్వ
రుఁడు। మనస! కరుణ నెదను బూని వరభూతదయఁగల్గి।
పరమాత్మ నుతియింపవే॥

4. బాహ్య మధ్యాంతర వర్తనముల కని। పట్టు నే కేశ్వ
రుఁడు। మనసా! యేహ్యగుణములరోసి యెల్లప్పుడాజగ।
దీశుని స్మరియింపవే॥

5. ధరణిఁ బరబ్రహ్మదాసకోటి కిబెన్ని। ధాన మే కేశ్వ
రుఁడు। స్థిరభక్తి నెదఁబూని చిత్తభ్రమలుమాని। పరిశుద్ధ
నెఱనమ్మవే॥

---

# అనుతాపము

మోహనరాగము - ఆదితాళము.

పల్లవి

**35.** నిను సేవింపని పుట్టువ దేటికి! నిఖిల జగదధీశా! ఈశా!

అనుపల్లవి

నీ నిర్మితిఁజూడని కను లేమిటికి? నిష్ఫలములు ధరలోను

చరణములు

1. నినుఁజింతింపని చింత యేమిటికి? నీరములేని కొలఁకేమిటికి? నినుఁబాడని యా కృతు లేమిటికి? నెనరులేనియా మగతనమేటికి?

2. నినుగుతింపని ముచ్చటలేటికి? నీచులతోడను స్నేహము లేటికి? పనిలేకుండెడి బ్రతు కేమిటికి? భక్తిలేని ధ్యానం బేమిటికి?

3. ప్రత్యుపకారము చేయనిదేటికిఁ? ప్రాణిహింసయుం జేయుటయేటికి? మెతుకులకొఱకిచ్చకమేటికి? మిత్తి నిత్య మని తెలియమియేటికి?

4. సర్వకర్తను దెలియమియేటికిఁ? జంచలమతులను గూడుట యేటికి? గర్వమువిడువక యుండుటయేటికిఁ? గడఁకను నిత్యునిగూడమియేటికి?

# అనుతాపము

36. హిందూస్థానిరాగము - అటతాళము.

1. పాతకహరణదేవా బ్రహ్మస్వరూపా । భూతములకునాది భూతమై వెలసిన॥

2. నారాయణా సదాశివ కారుణ్యసాగర । సొగసైన నీరూపము నేఁడిఁ గాంతునో॥

3. దేహాభిమానములఁ దిరుగుచునిరతము । మోహజలధిఁ బడి మునిఁగి తేలుచుంటిమి॥

జంఝూటీరాగము - ఆదితాళము.

37. 1. పరమపురుష యహో బ్రహ్మస్వరూపా । పరుఁడవునీవే నాదొరవును నీవే॥

2. హరిహర బ్రహ్మలు నంతయునీవే । పరభక్తుల కల్పతరువును నీవే॥

3. సుఖమాయనుబడి కానకమార్గము। తెలియక చేసితి కలుష
ములెన్నో॥

4. ఎన్ని నేరములున్న నన్ను నసేయఁగఁ। గన్నతండ్రి నీవే
గాక మఱెవ్వరు॥

శోకవరాళిరాగము - చాపుతాళము.

పల్లవి

38. ఈశ్వరా! సర్వేశ్వరా!

అనుపల్లవి

ఈశ్వరా! రక్షింప నిల నీవొకఁడవే యీశ్వరా! సర్వేశ్వరా!

చరణములు

అజ్ఞాన మనియెడి యంధకారము చేత నీశ్వరా!
ప్రజ్ఞాస్వరూపా నిన్ బ్రకటింప లేమైతి మీశ్వరా!

# అనుతాపము

లోకమందుమాయ లోనగువానిచే నీశ్వరా!
ఏకమేవాద్వితీయ మనుమాట నెప్పుడో మఱచితి మీశ్వరా!
కామక్రోధాదులను గడుసు మెకములు దఱుము నీశ్వరా!
వేమఱు నేర్పరి వేటకాండవని వేడగ బ్రోవవే మీశ్వరా!
వెతలను లతలలో వేసాఱుఁ జిక్కితి మీశ్వరా!
సతతము నినుఁ బిల్వఁ జయ్యన రాఁగదే ఈశ్వరా!
ఎన్నెన్నో పాపము లెఱిఁగెఱిఁగి చేసితి మీశ్వరా!
అన్నిటి మన్నించి యాదరించుటకే నే ఈశ్వరా!
కామాంధకారముచేఁ గన్నులు దెలియక ఈశ్వరా!
ఏమేమొ చేసితి మెంచరానివెల్ల ఈశ్వరా!
అణువునసైతమీవసరి యుండువను నాలోచనలేకీశ్వరా!
అనయము బహువిధకృత్యములనే మాచరించినార మీశ్వరా!
మనసు చెప్పిన వినక నహిత కృత్యంబుల నీశ్వరా!
తనివి దీఱఁగ మేము తప్పక చేసితి మీశ్వరా!
అనుదినము నిను నాత్మను దలఁపగ నీశ్వరా!
ఎన్నలేని పాపము లెల్ల శోషింపవో ఈశ్వరా!
సర్వజ్ఞ! ప్రోవవే శాశ్వత! గావవే? ఈశ్వరా!
సర్వసమ! మమ్ము సాదరముగఁజూడు మీశ్వరా!

## అనుప్రాసము

ఎంతవేఁడినఁ గాని　　　　　　యేలకరుణింపవో ఈశ్వరా !
పంతమా మాపైని　　　　　　పాలింపవె యిఁక ఈశ్వరా !

మాళవగౌళరాగము - చాపుతాళము.

పల్లవి

39. ఎన్ని రీతుల నిన్ను సన్నుతించుచుము
మన్నించి ప్రోవవో ప్రసన్న ! ఇఁక నైన.

అనుపల్లవి

నీవార మనుకు మేమిఁ కేవారి నమ్మము
కావరాదఁటరా ! రావా కరుణాసాగరా ! మేరా

చరణములు

1. అనయము నీపాద　　　　　వనజములే నమ్మిన
తనయుల రక్షింపఁ　　　　　దగదో దలంప

అనుతాపము

2. నీమహిమఁ బొగడ మాతరమా యిల
పామరులను బ్రోవ సామి నీవేకదా.

3. ఎప్పుడు నినుఁగొల్చు భక్తకూటములను
ఇప్పుడవని వృద్ధికి నెక్కనిమ్ము స్వామి.

రేగుప్తిరాగము – చతురశ్రజాతిలఘువు.

పల్లవి

40. భారము నీదె పరమపురుష నీవారమైతిమయ్య!

అనుపల్లవి

చారుచరిత వందారుజనావనధౌరేయ జగత్కారణంబ మా.

చరణములు

1. సారెకు విషయ వికారవేగమను మారుతమునఁ దూలి!
దారుణతాపత్రయనక్రాదుల బారి కులికి యులికి!

## అనుతాపము

2. తీఱనిపాతక భారమునను సంసారాంబుధి పలునూఱుమునుం గుచుఁ। దారియెందుఁగన కారసితావక కారుణ్యమెప్పగతి గనుఁగొంటిమి!

భైరవిరాగము - రూపకతాళము.

పల్లవి

41. ఈమాయ తెమలింపవేమయ్యా!

అనుపల్లవి

కామాదివశమునొంది యీమేనుదిరమటంచునుండు!

చరణములు

1. సారంబులేని బంగారుపిచ్చుక పనినెవ్వారైన వివరింప వశముగాదుగా!

2. పారరహితసర్వలోక కారణంబ వైతివీవు!
ఘోరమైనమోహాంధ కారమందునుంటి మేము.

## 42. మారువరాగము - ఆదితాళము.

1. చంచల మేటికె చపలచిత్తమా - యించుక యోచించు। కొం
చెపు గుణములఁ - గూడియుండు గతి ! ఎంచక తిరిగెదవా -
యెఱుఁగవా.

2. తనువుతోడ జను - లైన సకలములును ! తనను గూడిరావే॥
తన ఈశ్వరభక్తియు సద్వర్తన - మును దోడగుఁగదవే॥ ఓ
మనసా !

3. త్రికరణశుద్ధిగఁ జేయని భక్తికి - దేవుఁడెటుల మెచ్చు। అక
ళంక మతినొనర్చెడి భక్తి - నొకనిమిషమె చాలు॥ ఓ
మనసా !

4. అవయవ పుష్టియునో బలమును। ధన కనకరియుండఁగానే !
యవిరళభక్తినొనర్ప కున్న మన - కావలగతియేమే॥ ఓ
మనసా !

5. ఆశఁబూని నిజభక్తి నీశ్వరో - పాసనఁజేయుమికఁ । నీస
ద్భక్తికి మెచ్చి యీశ్వరుఁడు - నిన్నుఁ బ్రోచుఁగనుక॥ ఓ
మనసా !

6. పరబ్రహ్మదాసుల భాగ్యము పర - బ్రహ్మోపాసనమే॥
పెరత్రోవలఁ బోవనేలయేకే । శ్వరుఁడేగతియనవే॥ ఓ
మనసా !

## ప్రార్థన.

భైరవిరాగము - చాపుతాళము.

పల్లవి

43 స్వామి నీవని నిన్నేసారి వేఁడితిమి సత్స్వరూప ! కావుమి.

అనుపల్లవి

వేదము నీమహిమ వర్ణింప మాకిల
సామర్థ్యముగలదా సర్వసుఖదా

చరణములు

1. అనయము నీమహిమ అద్భుతమైపరఁగు
తనివి తీఱదెంత తఱచి చూచినను
మనమునకైన నీమహిమ తెలియ దకట !
వినయముతో వేఁడఁగా నుపేక్ష వాగా?

2. నీవు చేసినయది నీకే సమర్పింప
పావన ! యదియెట్లుపరఁగ శ్రేష్ఠమగును ?
ఏవిధమునఁ జూడ నేదియు నీదె గాన
భూవినుత ! ప్రోవవే మముఁగావవే.

3. మూఢ మతములందు మూగిన చిత్తముల
గాఢాంధకారంబు కడలకు దిగఁద్రోచి
ఏడ నిండియుండు ఎక్కడయిన నేర్పు
కాఁడ ! కలుషహార ! కరుణాకరరూప !

# ప్రార్థన

పూరికల్యాణిరాగము - చాపుతాళము.

పల్లవి

45. గతి వేఱు కలదో తండ్రీ! కరుణింపవలదో సుమ్మీ

అనుపల్లవి

సతతంబును నీదుపాద సరసిరుహముగాక మాకు

చరణములు

1. వేతలఁదీర్పఁగలవటంచు వేమఱు నిన్నే తలంచు
పతితులమౌ మాకు నోరి భక్తవరద! నీవె గాక

2. కల్యాణగుణనిధివై కరుణతోడ జీవకోటి
కల్యాణం బొసఁగఁబ్రోచు కర్తనీవు గాక మాకు

3. పురుషోత్తమ! మాదుహృదయ ములను జక్కనైనత్రోవఁ
బురికొల్పుట కీవగాక పుడమినైన నెచటనైన!

4. పాపకృత్యముల ననంత భంగులాచరించి యెంత
తాపమునఁ గృశించినను ముదంబుతోడఁ గాచుటకును

5. నారాయణ! సర్వలోక నాథ! యచ్యుతా! ముకుంద
రారాయని పిలుచుమాకు రక్షకుఁడవు నీవుగాక.

# ప్రార్థన

**46.** బేహాగ్ రాగము - ఆది తాళము.

1. బ్రహ్మోపాసక - సంఘ నిర్వాహక ।
   బ్రహ్మస్వరూపా - పాహిపాహి మాం ॥
2. మూఁడు గుణంబుల - మూఁడు కార్యముల ।
   వేడుకఁ జేసెడి - నిఖిల చరిత్రా ।
3. అండపిండబ్ర - హ్మాండములందున ।
   నిండివెలింగెడి - నిర్మలరూపా ॥
4. దేశకాలములఁ - దెలిపెడిభేదము ।
   లేశమెఱుంగని - యీశ మహేశా ॥
5. పరబ్రహ్మ స । ద్భక్తసదార్చిత ।
   చరణయుగళ భా । సుర కరుణాకర.

**47.** హిందుస్థాని కాఫి రాగము - అటతాళము.

1. శరణాగతులము నీ - దరిఁజేరినాము సు
   స్థిరకృప నేలుమయ్యా - నమ్మితిమయ్యా ॥
2. కాల మెల్లను వృథా - గాఁగడపుచు మాయా ।
   జాలమునను బడితిమి - వేసరితిమి ॥
3. కరుణాస్వరూప నీ - కన్న మాకిఁక వేఱే ।
   దాతలెవ్వరున్నారయ్యా - కరుణఁజూప ॥

## ప్రార్థన

4. ఎన్ని నేరములున్న - మన్ననఁజేసిమా।
సన్నుతులను గొనుము - సద్గతినిమ్ము॥

5. పాపహరణ - బ్రహ్మాదాసావన।
తాపసార్చిత చారణా - సుగుణాభరణా॥

48. తోడిరాగము - ఆదితాళము.

పల్లవి

ఎన్నాళ్లుతాళుదు మేరా మాసామి

అనుపల్లవి

చెన్నారునీ ధ్యానముల జిత్సుఖము లియలేమి?

చరణములు

1. చల్లని వాఁడని యెంతో చనవున నిచుఁ జేత్రి
అల్లన ప్రాణుర్కొచున్నారి మాదరమునఁబ్రోవుము

2. ఎచ్చటఁ బోయిన నీమ ముచ్చటలేవేలులేదు
నిచ్చలు నీస్మరణలే నిద్దుర కంటికిరా

3. కిన్నతండ్రివై దుము కాతు వనుకొందుము
ఎన్నెన్నో యెన్నియందు మిటు కోప మేలుఁగవు.

# ప్రార్థన

నాథనామక్రియ రాగము - ఏకతాళము.

పల్లవి

49. కరుణారస పరిపూరిత ! శరణాగత పోషణా !

అనుపల్లవి

నిరుపమ తేజమ నిష్కళంక ! నిఖిలసుగుణభూషణా !
నేరమా ? నీకు భారమా ? నను నాదరించుట ప్రేమతో

చరణములు

1. తల్లి తండ్రి నీవె కాన్య దాత నీవయంచు మా
యుల్లమాలోఁగ పల్లవింపఁగ నుల్లసిల్లుదుమార ఓరీ !

2. సర్వలోక పూజ్య ! సుజన సన్నుతా ! యత్యున్నతా !
నిర్వహింపఁగలేము మా పాప నికరములను బాపుపాపు.

3. నిర్మలానంద స్వరూప ! ధర్మమా యిది ధర్మమా
పాపబాధలనుండి మమ్మిలఁ గావుమా యభయమివ్వుమా.

శహాన రాగము - త్రిపుట తాళము.

పల్లవి

50. ఆలింపవే యయ్యా ! మా మొఱలను ఆదరింపవయ్యా !

అనుపల్లవి

లాలించి ప్రోచుద యాళుఁడేవని దాస
లోల ! శీల ! నిన్నెంతో కాలమైనది నేఁడి.

# ప్రార్థన

## చరణములు

1. లీలగ నీవే సృష్టి స్థిత్యాదులఁ దాలిచి యుండఁగని మేలిమినొం
దిన మృదుహృదయంబును సౌలభ్యమును గన్గొని వాలాయము
గ నెవ్వారును శరణొందఁ బాలితాశ్రితుఁ డౌనని ఏలోకమున నీ కె
వ్వఁడు లేడంచు మాలోన నెంచుకొని నీ పాలఁ జేరఁగా.

2. మాయలఁ జిక్కి కామాంధుల మైతి నీయాజ్ఞ గడచితిమి వేయేల
యయ్యా! గర్వించి పాపంబులే చేయువారలమైతిమి పాయని
ప్రేమోపాయముఁ గొనియిప్పుడో యయ్య వచ్చితిమి న్యాయప్ర
దాతవని నమ్మినదానికి మాయందుఁ గృపయుంచుమా ఆశ్రిత
కామా!

3. కదిసి నిచ్చలు సౌఖ్యమునొందనగునని మదినీ నైనంతుమురా!
వదలని భువి యాపదలను వెలిచి నీపాదములఁ బడితిమిరా!
సదయుఁడవై సృష్టిలయించు దేని నీ పదవికి సరి కాదురా!
చెదరిన చిత్తము కుదురుగ నిల్పి నెమ్మదినొందఁ జేయుమురా!
ఓ మనోహర!

# ప్రార్థన

హిందూస్థానిరాగము - సురటితాళము.

పల్లవి

51. ఇది యేమిసెయ్యా మేర మాయయ్యా!

అనుపల్లవి

ముదమునఁ గరుణాబ్ధి ముంపఁగదయ్యా!

చరణములు

1. వందిత గుణనిధీ!    వాత్సల్యజలధీ.
వందారు నిజభక్త    పాద! మాయయ్యా!

2. అవివేక తమమున    ననయముఁ దగిలి
అపగతి శోకాగ్ని    నలయు చుండఁగను.

3. కామ క్రోధాదులన్    గాలములోనై
వేమాఱు ముప్పుల    వేసట నొంద.

4. అష్టఁదిప్పితి మని    యలిగి యున్నావో
అష్టత యనిమాపై    ననుకంప వలదో.

5. ఎంతని వేఁడుదు    మింతటి కఠిన
స్వాంతమేల గల్గె    సదయతఁగనుమా.

6. పక్కువగలయట్టి    మాతవు గావే
అక్కటా మముఁగృప    నరయఁగ రాదే.

7. శరణాగతపాల    సద్గుణశీలా
చరణ భక్తుల    రక్షణ సేయవేలా.

# ప్రార్థన

**52.** దేశీయతోడిరాగము - రూపకతాళము.

భక్తజీవనా! పరమపావనా! ముక్తిదాయకా! భువన నా
యకా! భయవినాశనా! భక్తపోషణా! ప్రవిమలాత్మ! సర్వా
ఘశోషణా! ఎంత వేఁడుదు మెవరిఁగొల్తుము చింతతీర్పవిదా సేవకుల
కును, పాపభీతి నీపాలఁ బడిన మా యాపదలను వే యణఁచి కావవే
పరమదయాకరా!నిరుపమా! మముంగరుణఁజూచి మాకలకఁదీర్పుమా!
మోదమానవకా నీదయారసా స్వాదనంబుచే సేదఁ దీర్పవే. ఓద
యానిధీ! యాదికారణా! నాథ నాథ! మమ్మాదరింపవే. భూమి
లోన నీ ప్రేమలేక మేమే మొనర్తుమో కామితార్థదా! చిత్తగోచ
రా! చిన్మయాకరా! యుత్తమప్రభూ! యూఁడింపుమా. నీవు
కాక వేఱెవిభుండు మమ్మీవసుంధరం బ్రోవ నేర్చునే. వందనమ్ము
లానందమూర్తి నీకిందొసంగవే యందుకొమ్మురా! శరణమంచు
నీచరణపద్మముల్ చేరంగనింక మమ్మరయ వేటికో. పంతమేలరా!
యింత వేడఁగాఁ జెంతఁజేర్చిమా వంతదీర్పవే. సచ్చిదాత్మకా! సర్వ
రక్షకా! మచ్చికన్నముఙ్ మెచ్చఁగావవే.

ఫరజురాగము - ఆదితాళము.

పల్లవి

**53.** ఉదారుఁడవుగావె ఓపరమదైవతము నీవే

## ప్రార్థన

అనుపల్లవి

సదయహృదయ నీ వదనుగనుగొనుచు ముదమున
దీనుల వెదకిపోవుతువఁట.

చరణములు

1. చదువులు వెయ్యేలా సాకెవు చదివించుటయేలా!
కదలనిధారణ గలదని పదిలో ముదముగలుగనేలా!

2. ఇదిమూలంబని యెఱుఁగరాకనీ వెదనొక్కొక్కనికి నె
లమిదోఁచుచుక॥

3. గొదవలేని కోవిదతనొసఁగి పెంపొదవనమిత సంపదలో
సఁగుదువఁట.

హుసేనిరాగము - రూపకతాళము.

పల్లవి

54. ఆనంద వారినిధీ! యఖిల సుగుణ శరధీ!
అచ్యుత! ప్రతవత్సల సమ్మాదరింపుము తింద్ర!

అనుపల్లవి

దీనచింతాపహారి పంచు దినమును నినుఁగొనియాడ
గానముల ధ్యానములఁ గావింపఁగ నానడింపు.

## ప్రార్థన

చరణములు

1. తల్లిదండ్రులను బాధ్య తల డెందంబున నుంచి
తప్పక నీయాజ్ఞలనే యొప్పగ నొనరించి
వల్లభుండా! నీపాద వనరుహ సేవను మించి
వసుమతిఁ గాలముఁ గడప వరమిచ్చి కరుణించి.

2. పామరుల సంగతిని బాయుచు నార్యుల గతిని
నీమహిం దనరఁగ వ ర్తించుచు సమ్మతిని
ప్రేమ పెనంగొన నిన్ను వేమఱు ప్రణుతింపఁగను
మామక జీవనము సుధా మాధుర్యమ్మగఁ జేసి.

3. పందిరిఁ దీఁగలు గోరు ప్రభువును దీనుఁడు చేరు
పతివ్రతయును నిజ భర్తఁ బాయకుండఁ గోరు
సింధువు నది చేరు నా చందమ్మున నిను గోరు
నందనులకును బ్రహ్మా నంద మొసంగెడు స్వామి!

**55.** కాంభోదిరాగము - త్రిపుటతాళము.

పల్లవి

ఎంత వేఁడిన మాపై నేలరా దయరాదు? ఏమి నేరము చెప్పుమా.

అనుపల్లవి

సంతసమున మా స్వామి యనుచు నిన్ను
శరణుఁజొచ్చిన వెనుక శ్రమపెట్టఁ దగునె?

# ప్రార్థన

## చరణములు

1. చింతలు వదలి మాచిత్తములను నీదు
చెంతఁ జేర్చితిమిరా!
పంతము మాను మో బ్రహ్మాస! నిన్నుదక్క-
నంతరంగ సుహృదుఁ డన్యుఁ డెవ్వఁడు లేఁడు.

2. అపరాధములను నాచరించితిమని
నెపముల నెన్నకురా!
కృపకావలె నంచుఁగోరి చేరినవారి
యపరాధముల మాన్పనధిపుఁ డీవ కదరా.

3. ఆపద్బాంధవ! మమ్ము నాదరింపు మటంచుఁ
గోపము సేయకురా!
ప్రాపు నీవే యని ప్రార్థించుచుండఁగ
మాపయి నీకిటు వఱపాయె నిది మేరా?

3. దోసకారులిట్లు ఘోషించుచుండ వి
శ్వాసము నుంచవేరా!
దోసములను బాపు దొర నీవై యుండఁగ
వాసిగ వానిని వారింపనేరవె?

# ప్రార్థన

5. నీవే దిక్కని మేము నెఱనమ్మి యుండఁగ
గావఁ దలంప వేరా!
కావనియెడల నో కారుణ్యమయా! నమ్మి
సేవాఁడు చేకొని యెలమిఁ బ్రోవఁగ నేర్చు?

## 56. పున్నాగవరాళిరాగము - అటతాళము.

పల్లవి

ఏల చూడవురా? నను దయ నేలచూడవురా?

అనుపల్లవి

చాలవిపత్తులసంసారాంబుధిఁ గూలుచు గతిఁ గానఁజాలని వారల

చరణములు

1. చలచిత్తులమగుచు విషయేచ్ఛలఁ జిక్కినలఁగుచుఁ
గలకాలము నీతలఁపించుక లే కలయుచుందు
పుత్రుల మన్ననతో.

2. పరజీవులయందుఁ బ్రేమను బాటింపక యెందు
దురితంబులనే విరచించుదురాచారులై నను నిను శర
ణముఁ బొందగ.

3. సరస గుణాభరణా! యగణిత సర్వలోక భరణా!
చరణసేవకుల నరసి యాభయామిడి పరమపద మొసఁగు
పరుఁడ వీవగద.

# ప్రార్థన

ఆనందభైరవి రాగము - రూపకతాళము.

పల్లవి

57. ఇంకెంత బ్రోవుమురా! ఓ సకలార్తిహరా!

అనుపల్లవి

అకలంకుఁడ తావక సేవకులఁ

చరణములు

1. పరుఁడంచును శ్రీ కరుఁడంచును ప్రా
ణ్వరుఁడంచును నిన్నెఱ నమ్మితిమే.

2. నిను గొల్చిన వారిని నీవును బ్రో
చును జేకొనుదం చును నమ్మితిమే.

3. అకటా! నినుఁ గొల్వక నీదు విధా
యక కృత్యము సేయక యుండిన నమ్మిక.

4. ఒరు లెవ్వరు నీ సరి పెద్దలు గా
దర! పాండోర! యొప్పరికింపకురా!

5. పటు భక్తుల సంకట మెల్లను మా
న్పుట సేవని గా దటరా! యెటురా?

బేహాగు రాగము - అటతాళము.

పల్లవి

58. దాసలోకపాలా! దయఁ గానవేలా;

## ప్రార్థన

అనుపల్లవి

తా్రసముఁదీక్షించి తప్పుల నోరిచి

చరణములు

1. దోసము లెన్నియొ చేసితి నంచును
గాసిలి చిత్తము కందఁగఁ గుందఁగ.

2. ఎక్కడ నీకృప దక్కఁగ దిక్కను
ఒక్కటి లేదని చిక్కఁగ మ్రొక్కఁగ.

3. వేసటలు మానుది నేసట కీసహి
నీసుధు రాసల నాపముఁ గ్రోలఁగ.

4. మాపయిఁ గోపముఁ జూపిన నోపఁగ
నోపము మాపరి తాపము వాపుము.

5. భక్తసంరక్షకా! పాపౌఘ శిక్షకా!
ముక్తిప్రదాయక! భువనైక నాయకా.

ధన్యాసిరాగము - ఆదితాళము.

పల్లవి

59. సామి! కరుణఁ బ్రోవుమీ నిను సతతము నమ్మితిమి.

అనుపల్లవి

వేసటలు నిను మది విడక కొలుచు సమయముఁ
కామక్రోధలోభాదులఁ దగులక.

# ప్రార్థన

చరణములు

1. ఈశ్వర హే నీవు దక్క పతి నా
కేదియు దిక్కు గానన్య మనుచును
స్వామి ! నిన్నే వేండి నందును సతము
నమ్మి నిల సదయతం గావుమీ.

2. సృష్టి భూతంబు లాదిగా నిను
సృష్టియనుచుం బల్క నిల నీ
సృష్టి నయి నట్టి మహిత శక్తిని
నిష్ఠతో వేండు నట్టి నమ్మిక.

బేహాగ్ రాగము - ఆదితాళము.

పల్లవి

60. అనుదినము మము అవ్యయ ! కావుము.

అనుపల్లవి

నిను మదిం గొలుతుము నిఖిల లోకేశ !

చరణములు

1. నిత్యుండ వనియు నిర్మలుండ వనియు
నిత్యము నీనామ స్మరణం జేసెద మిదే.

## ప్రార్థన

2. పరసతులను జలు — బాపులఁ బడనీక
నిరతము నీదు వాసు — స్మరణ నేయుటక

3. పాలకమును నగ్గి — పర్వ పముఁగాల్వఁగ
భూదయార్ద్రసాం — బుద్ధిఁ జల్లార్పవే.

4. సకలలోకములకు — సామి నీవే యని
ప్రకటితముగ నినుఁ — బ్రస్తుతించెదమిదే.

5. ఇనుఁడు నీ భయమున — లోకమునను
అనయముఁ గాయును — అఖిలలోకేశ !

6. చేతులులేకరయే — చేతనము లాదిగా
భూతంబుల నిలఁ — బుట్టింతు వోపర !

7. ఎందుననుండియు — నెక్కుడఁ గానవు
పొందఁగ నమ్మిటు — పోషించుచుందువు.

8. ఎల్లవారల యెడ — నెంతో సదయుఁడ
వుల్లము నిను నేఁడ — నుద్ధరింపుమి పరుఁడ !

కల్యాణిరాగము - రూపకతాళము.

పల్లవి.

61. సర్వాంతర్యామి ! — సర్వేశ్వర ! నమ్మ
సాదరముగఁ గావుమా

## ప్రార్థన

అనుపల్లవి

ఉర్విఁ మా చేసిన సర్వదోషముల
నిర్వహించుటకు · నీవె మఱెవరింక.

చరణములు

1. నిత్య! నిర్మల! నిర్గుణ! నిర్వికల్ప! మాకు నీవే దిక్కనుచు
సత్యస్వరూప! సదయుఁడవగు నిన్నే సారి వేఁడినందుకు నిత్యా!
ద్వితీయ! నిస్సంసార! నిర్జితేంద్రియ! నిరహంకార! సత్స్వ
రూప! సుగుణాలోల! సర్వజనపాల! యని సతతమునమ్మి
నందుకు.

2. సర్వ కాలముల సర్వావస్థలయందు సామి! యేమఱకుండు
మా సర్వజన శరణ్య! సర్వశక్తిమయ! సర్వాత్మక! బ్రహ్మ
మా! సర్వేశా! యిల సర్వసుఖప్రద! సర్వ భూతసమ! స
దానంద! సర్వమందుఁ బర్వి సర్వము నీవై సర్వజ్ఞుఁడవగు శా
శ్వత దేవా!

భూరికల్యాణిరాగము - చాపుతాళము.

పల్లవి

62. కరుణయుంచరాదా పరమపురుష వాదా.

ప్రార్థన

అనుపల్లవి

నిరతిశయానంద! నినునమ్మిన దాసులపై.

చరణములు

1. ధరలోనిచరాచరములు తక్కువస్తుజాలములు
సురుచిర లసదంబరచర సూర్యసుధాకరులు
వరతారకగణములు నీ పరిపూర్ణ కారుణ్య
సరసాలాపములఁ దెలుప సంతసిల్లువారలపై.

2. పనిఁగొనియఖిలాండములను భరణహరణ దాల్చుచును
తన జీవులకును ధర్మము నొనరవిధించుచును
అనుతాపాగ్నిని ప్రజ్వలితునఘులను గరుణావృష్టిని
దనిపితాపమెడలించు తండ్రి! మావిూఁదనింక.

బిలహరిరాగము - రూపకతాళము

పల్లవి

63. తలంపుననెదేవా మమ్ముదయఁబ్రోవలేవా॥

అనుపల్లవి

తులువతనముతోడి తమముదొలఁగమృత్యుజలముఁ ద్రోచి
చెలువైన తెలివితోను వెలుఁగునమృతఫలమొసఁగుము.

# ప్రార్థన

1. పలుకులునీపగిదెవినమి పలువురువిని తెలిసికొనమి!
పలుకవాఁడు తెలియువాఁడు నిలవరుడై రక్షన్.

2. వెలియాసల మెలఁగి మృత్యుబలవత్తరపాశమ్ముల నవి
మక ధీరులు నినున్దలఁచి యమృతఫల మందిరి.

సురటిరాగము - అటతాళము.

పల్లవి

64. పాలింపవేయనఁ జాలుదువే !

అనుపల్లవి

మేలుమేలునమ్మేలుచున్న శుభ శీలునినినుఁగనఁజాలక నేడిఁక.

చరణములు

1. మేలొనఁగూడినమే మెవలంతులమాలోనన మునననుకొ
నుచున్.

2. కాలవశంబునఁ గష్టముఁగూడిన పాలునాలి తీ శ్వరాయ
టంచున్ !

3. స్థూలమతుల మైత్రిమోలనున్న నీలీల లెఱుంగక తూలుచుఁబడుచు
మీలితాత్మ మైపాలుఁగ్రోలెడి నీడాలముగతి నై కేలుమోడ్చెపరి॥

# తత్త్వోపదేశము

---

బ్యాగడరాగము - రూపకతాళము

పల్లవి

65. నాన్యః పంథావిద్యతే అయనాయనాన్యః పంథా విద్యతే.

అనుపల్లవి

యాన్యనవద్యాని కర్మాణి తాని
సేవితవ్యాని నో ఇతరాణి

చరణములు

1. అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథారసం నిత్య మగంధవచ్చ యత్
అనా ద్యనంతం మహతఃపరం ధ్రువం
నిచాయ్య మృత్యుముఖాత్ ప్రముచ్యతే.

2. నసంధృశే తిష్ఠతి రూపమస్య
నచక్షుషా పశ్యతి కశ్చనైనం
హృదా మనీషా మనసాభిక్లుప్తః
యఏత ద్విదుర మృతాస్తేభవంతి.

3. సఏషోంత హృదయ ఆకాశః
తస్మిన్నయం పురుషో మనోమయః
అమృతో హిరణ్మయ ఆకాశ శరీరం బ్రహ్మ
సత్యాత్మ ప్రాణా రామం మన ఆనందం.

శంకరాభరణ రాగము - రూపక తాళము.

పల్లవి

66. సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మశాంతం శివ మానందం.

అనుపల్లవి

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
అత్యంత దీనాయ పరమం నిధానం.

చరణములు

1. ఏకో దేవ స్సర్వ భూతేషుగూఢః
సర్వవ్యాపీ సర్వ భూతాన్తరాత్మ
కర్మాధ్యక్షః స్సర్వ భూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ.

2. అపాణి పాదో జవనో గ్రహీతా
పశ్యత్య చక్షు స్సశ్రుణో త్యకర్ణః
సవేత్తి వేద్యన్నచ తస్యాస్తి వేత్తా
తమాహురగ్రం పురుషం మహాంతం.

3. తేధ్యాన యోగానుగతా అపశ్యన్
దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం
యః కారణాని నిఖిలాని తాని
కాలాత్మయుక్తాన్యధితిష్ఠత్యేకః.

ధన్యాసిరాగము-ఆదితాళము.

పల్లవి

67. జనన మేటికే నున జనన మేటికే.

అనుపల్లవి

అనుదినమును బుధపోష్యము నాత్మభజన సేయకున్న.

చరణములు

1. ధన ఘనాది పాశమందుఁ దగులు వదక చిత్తశుద్ధి
దనర నాయనంతు మహిమఁ గొనియాడి సుఖింపకున్న.

2. అవనిని చిఱుసుఖముల నమ్మి ఆత్మానందమును దెగడి
అవగుణమునఁ బాపకృత్యమందుఁ గుందు చుంటిమేని.

3. ఈడు జోడు లేక జగము లెల్ల పాలనంబు సేయు
తోడు నీడయైన మేటి తోయగాని డాయలేని.

4. తనదు పుత్రవాత్సల్యము వెనఁగొన భాసిల్లుచుండు
మనతండ్రిని జనవు మీఱఁ గని కౌఁగిటఁ జేర్పకున్న.

తత్త్వోపదేశము

౫. ఎల్లెడ విలసిల్లి సుధలు చల్లుచుఁ దనచల్లని కృప
నల్లన మన యుల్లములను గొల్లగొను నల్లయ్యఁగనని.

ఆరభిరాగము-రూపకతాళము.

పల్లవి

68. మోదించివినరయ్యా-

అనుపల్లవి

ఆదరంబుతో బ్రహ్మవాదులపలుకులనా !

చరణములు

ఆనందమయుఁడైన వానివలన జగముగలిగె !
స్థానమందితుదినందె లీనంబగునే?
వానిఁజెందలేక వాఙ్మనసములు మరలువాని
జ్ఞానంబుగలుగనెందునేని భయముగల్గదు ?
వానిదె పరమానందము దానిలవములితరులందఁ బూనుదు
రాపరవస్తువె ధ్యానమునకునాస్పదంబు.

అఠాణారాగము - రూపకతాళము.

పల్లవి

69. తెలియవలయుఁ దిరముగా !

అనుపల్లవి

తొలుతవేదిలమొఱలున నలమొకండెకలఁడంచు !

## తత్త్వోపదేశము

చరణములు

1. తలంపనెడుతపంబుననె చరాచరము జగమెల్ల నలంత తేకలరించె నఖిలేశుఁడు!

2. కలిగెనతనివలన సకలబలేంద్రియ ప్రాణంబులు నిలయ నిలానలంబులును జలంబులును జదలుమఱియు!

3. దలఁకివానివలననె కరువలియు మిత్తి వజ్రియురవిజ్వాల సుండును స్వకృత్యములు సలుపుదురదెపరవస్తువు!

సౌరాష్ట్రరాగము - త్రిపుటతాళము.

పల్లవి

70. కల్లగాదు వినరయ్యా!

అనుపల్లవి

ఎల్లవస్తువులకు నిల్లయిన పరవస్తువు నుల్లమునందు
సంధిల్లఁజేయుట మేలు.

చరణములు

1. ఎల్లెడఁగన్నులు నెల్లెడమోములు నెల్లెడభుజములునీశునకుఁ.

2. ఎల్లెడఁగర్ణములెల్లెడఁ జరణములెల్లెడ గన్గొను నెల్లెడనుండుఁ.

# తత్త్వోపదేశము

3. ఎల్లవారల యుల్లములయం దెల్లపుడు వర్తిల్లుచును జగమెల్ల
గుణములనల్లునాతఁడె వల్లభుండని యుల్లసిల్లుఁడు.

లలితరాగము - ఆదితాళము.

పల్లవి

71. దొరకొనునే ఒరులకునిది !

అనుపల్లవి

స్థిరశాంతాంతఃకరణుఁడగుచు దుశ్చరితములవలన
విరతిని జెందక !

చరణములు

1. పరహితరుచిరము లరసికొనుట సుస్థిరమతులకు నాదరణీయంబట.
2. పరహితకరతత్పరులకు మేలగు సురుచిరార్థులకు దురవాసంబది.
3. ధరణిలోన నెవ్వరి చరితము లే కరణినుండు నాకరణివారిదగు.
4. పరమార్థము సచ్చరితులకగుఁగా వరసచరితులగు దురాత్ములకునది.

# ధర్మోపదేశము

ధర్మోపదేశము

---

మోహనరాగము - చాపుతాళము.

పల్లవి

72. బోధింపరండీ జనుల బోధింపరండీ !

అనుపల్లవి.

బోధించి వారలఁ బురికొల్పరండీ !

చరణములు

1. శ్రుతినేక మేవాద్వితీయ మన్న వెడఁసత్య
సతధర్మ మెఱుఁగని మానవులకు మీరు.

2. పరఁగ నహింసా పరమోధర్మ యనే
పరమ వాక్యము మఱచు పర బాధకులను.

3. సత్యంవద యను సద్భాషితము మఱచి
నిత్యమసత్యోక్తి నిరతులైన వారి.

# ధర్మోపదేశము

జంఝూటిరాగము - చాపుతాళము

పల్లవి

73. హితులారా! వినుఁడీ నామాట.

అనుపల్లవి

స్నేహితులారా! గనుఁడీ నిక్కము నెచ్చోట.

చరణములు

1. ఈశుడొకఁడే యనుట నిజము స
ర్వేశుఁడు లేక యీ సృష్టి యక్కజము
ఈశుఁ దలఁచుట సహజము పర
మేశుఁడు లేక యేలేదీయీ రజము.

2. అందఱు మకని తనయులము గాన
పొందుగా వానినె పదినిఁ గొలుచుదము
ఎందు నుందు వనియెదము మన
మందముగా వాని నాశ్రయించెదము.

3. మనుజు లందఱు సహోదరులు గాన
ననయము నన్యోన్య ప్రీతి నెగడెదరు
పనిఁబూని ప్రభుని వేఁడెదరు వాని
మన ముప్పతిల్ల మన్నించి పాడెదరు.

## ధర్మోపదేశము

4. శరణన క్షమియించు వినరే యీ
వెరపుఁ దెలియని వారికిని జెప్పి పనరే
పరుఁడు దయాపరుఁడు గనరే వాని నే
మరక కొలుచు సత్పథముఁ జనరే.

5. పరులకు హితము చేయుచును పర
తరుణులఁ జూడుఁడి తల్లిపోలికను
మఱచి స్వార్థాభి మానమును, నిత్య
పరమ జీవన చింతప్రభు సేవగనుఁడీ.

6. పామరులఁజేర్చి వీరిలను మన
సామిట్టివాఁడని చాటరే చాల
స్వామి పరతయె బ్రాహ్మమతము దాని
ప్రేమవ్యాప్తము చేయుటయె భక్తహితము.

7. నిక్కమే జయపవును గాదా మన
దిక్కు జగన్నాథుఁడై యుండలేదా
అక్కట యిది తెలియ రాదా ఒక్క
గ్రుక్క ప్రాణము దాని గుర్తించరాదా.

నారాయణిరాగము - రూపక తాళము.

పల్లవి

74. సత్యమును వినరే భగవాదాజ్ఞా కృత్యమును గనరే.

# ధర్మోపదేశము

అనుపల్లవి

నిత్యనిర్గుణ సత్స్వరూపుఁడు నిఖిల లోక శరణుఁ డంచిత సత్య సంకల్పుండునా నొకసామి యెల్లెడ వెలుగువాఁడను.

చరణములు

1. యుక్తమున వెలసి ఘోషించెడు వేదోక్తులను దెలిసి భక్తవర దుఁడు పరమపురుషుఁడు ముక్తిదాయకుఁ డొక్కఁ డద్భుత శక్తుఁడై జీవరాసుల నాసక్తితోడ భరించువాఁడను.

2. మంగళము సెలఁగ మోహాకర్మాది సంగములతొలఁగ అంగర హితవినిర్మలాత్ముని అఖిల సద్గుణ నిధిని శ్రీతియెసంగ మనకో రికలు నీడేరంగ మననము చేయఁదగునను.

3. నిక్కము వచింపరే ధర్మ మెఱిఁగి చక్కన చరింపరే మక్క వను సోదరులటంచును మహిజనంబులఁ దలఁపరే యింక నెక్క డాధర్మంబు లేదనిగ్యిదను దృఢముగ నమ్మరే యను.

# ధర్మోపదేశము

**75.** పంతువరాళిరాగము - అటతాళము.

పల్లవి

బాహ్యావలంబనం త్యక్త్వా మద్ధర్మబద్ధే బ్రహ్మైకంజానధ.

అనుపల్లవి

ఇహచేదవేదీ దథసత్యమస్తి
నచేదిహావేదీన్మహతీవినష్టిః.

చరణములు

1. ఏకోవశీ, సర్వ భూతాన్తరాత్మా,
ఏకంరూపంబహు ధాయఃకరోతి;
తమాత్మస్థంయేను పశ్యన్తిధీరాః,
తేషాంసుఖంశాశ్వతం, నేతరేషాం.

2. నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం,
ఏకంబహూనాం యోవిదధాతికామాన్;
తమాత్మస్థంయేను పశ్యన్తిధీరాః,
తేషాంశాన్తిశ్శాశ్వతీ, నేతరేషాం.

3. ఏకోవశీ, నిష్క్రియాణాం బహూనాం,
ఏకోబీజం బహుధాయఃకరోతి,
తమాత్మస్థంయేను పశ్యన్తిధీరాః,
తేషాంసుఖం శాశ్వతం, నేతరేషాం.

## ధర్మోపదేశము

**76** అఠాణారాగము - చాపుతాళము.

పల్లవి

భజన సేయఁగ రాదే యో మనసా బ్రహ్మము నశ్రాంతముగ.

అనుపల్లవి

నిజరూపము నెఱింగి నిర్మల చిత్తవై
కుజనోపేక్షయు ధర్మగుణము సంగ్రహించి

చరణములు

1. ప్రథమభూతముల కె ల్లెడ నాహారాంగల
నిరతముఁ జేరిమి వాని నెడఁబాయఁడఁట నే
కడు వగనైనను గలిమి లేములనైన
విసువక యందఱి వెతలఁ దీర్చునఁట నే.

2. శరణన్న వారిని దనవు మీఱఁగ నెంతో
సరసతఁ బ్రోచెడ సాదరుఁడఁట నే
నిరుపమ శుభకీర్తి నెరయ లోకుల కెల్ల
బరఁగు కృపాళుఁడై పరఁగుచుండెడివాఁడఁట నే.

3. జగదేక పోషణా సత్యసంభాషణా
వినయ విహిత జ నేతర భీషణా
అగణిత ఘోరపా పాంబుధి శోషణా
సుగుణ విభూషణా సుజనైకపోషణా.

# ధర్మోపదేశము

77. కాపిరాగము - ఆదితాళము.

పల్లవి

పరమానందముఁగోరు పరబ్రహ్మభజన నింపారు మనసా!

అనుపల్లవి

పరమభక్తుల గోష్ఠినిజేరు పాయని సత్యనిరతుఁడవై వేమారు.

చరణములు

1. స్థిరములుగావీ భోగానుభవములు
దేహముతోడి వైభవములు
నిరతము బాధించు బహుపాప భయములు
నీ క్షేలభక్తియందు వలదీఁక భయములు.

2. రేయుంబగలెడఁ బాయనిమేటి
నేయుము నెలకొల్పి తగుమాటినిఁ
జేయుచు ధర్మానఁ జరియించి ముమ్మాటి
చిత్తము నిశ్చల స్థితినిల్వఁగఁనాటి.

3. అజ్ఞానాబ్ధి మునిఁగి దరిఁగాన
కలయుచు నున్నావటుగాన
ప్రజ్ఞానిధి కృపయగు నోడను దాన
పట్టుక చని జానతటిని సుఖాన.

# ధర్మోపదేశము

78. సురటిరాగము - త్రిపుట తాళము.

పల్లవి.

భజియింపవేమే ఆనందనిలయుని
భక్తితో నో మానసా !

అనుపల్లవి

అజుఁడునరూపుఁ డనంతుఁడైననుభువి
నందఱియెడల వెల్గొందు నానందుని.

చరణములు

1. నిఖిల హేయ ప్రత్య నీక స్వరూపుని
నిత్య మంగళ గుణా నీక నిక్షేపుని
అఖిల లోకో దయ పాలన శీలుని
అంచిత నిరతిశ యానంద శీలుని.

2. భూషణ దూషణ ములను ఖాటించి సం
తోష ద్వేషాదుల గాసి నొందెద వేల
శేషత్వమును దాల్చి స్థిరభక్తియుక్తమ
నీవ నీశ్వర పాద నీరజముల నెంచి.

8. దురభిమానము లను దొరవులలోఁ బడి
పొరలుచు నసువుల బోఁగొట్టుకొనెదేల
పరమార్థమెదనుంచి పాశములను ద్రెంచి
పరమదయాళు నభయము వేడవదేమె.

79. మోహనరాగము - ఆదితాళము.

పల్లవి

వలపు వఱవ వచ్చునా! మాసామి! నీతలఁపు వదల వచ్చునా?

అనుపల్లవి

ఇలలోన మా మనములను దెలిసి లీలఁ
గలిసి చిత్సుఖమును గరుణించు నట్టినీ.

చరణములు

1. చెలువము మించు నీ చేఁతల నేవేళఁ
దలఁచిన మే నేమో పులకరించెడుఁజాల
వల నీ గుణానుభ వామృతమును గ్రోలఁ
గలిగిననాఁటి సు ఖమ్ము నెన్న నీపాల.

2. తెలివిడి తనమునఁ జరిపిన నేరమి
వలన మామీఁదనీ వలుకఁ జెందకుసుమి

వలచి వేఁడితి మిఁక వచ్చిలాలింపుమి
సులభుఁడ వయి మమ్ము సొలసియేలెడుసామి.

8. నిలుపరాని ప్రేమ నెక్కొన మముఁగూడు
చెలువుఁడ! రమ్మని చేరి మ్రొక్కిననాఁడు
బలిమి గౌఁగిటఁజేర్చి పాయక తమిఁ దీర్చి
వెలసిననాఁటివే డ్కల నెన్న నీమేటి.

## 80. పున్నాగవరాళి రాగము - త్రిపుటతాళము.

పల్లవి

పండితు లెఱిఁగిన పరమార్థము

అనుపల్లవి

రెండొక్క గుహలోన నెండనీడలవలె నుండి
శుభము గొనుచునుండు ఖండితముగ

చరణములు

1. పండితమగు నొక్కమ్రానున నిరతమునుండెడి పక్షులు
రెండే గదా.

# ధర్మోపదేశము

౭. మెండైన రెక్కల దండితో సంగతి నొండొంటి నెడఁబాయ కుండుఁగదా.

౮. అండఁబాయకయందు ఫలము నొకండు మెసవుచునుండు రుచితో రెండవదిగొనకుండి మెఱయుచునుండునది యుద్దండమై తగు.

---

# మంగళము

---

నాథనామక్రియరాగము - చాపుతాళము.

పల్లవి

81. మంగళం మహిమాప్రసారా! మంగళం

అనుపల్లవి

మంగళం సజ్జన మానసకమలపతంగ
కారుణ్యాంత రంగ నీకెప్పుడు.

చరణములు

1. శ్రీలలితాంచిత చిదచిదాత్మక జగ
దాలికి సాధుజనాలికి బహువిధ
కాలములకు నందుఁ గావించు క్రియలకు
మేలుగ వీనిని మెఱయించు నీకును.

2. మానిత బ్రాహ్మ సమాజములకు నెల్ల
వానిశాఖలకు నవ్వానిపోషకులకు

జ్ఞానులై వారితో జతగూడి ఈశ్వర
ధ్యానకీర్తనములఁ దనరెడువారికి.

3. భాగవతులకును బ్రహ్మోపాసకులకు
బాగై వెలయు వారి భక్తిశ్రద్ధలకును
రాగ ద్వేషాది రహితులకును నిజ
భోగాభోగ సమ బుద్ధియుక్తులకును.

4. సత్యవాదులకును సన్మార్గ చరులకు
నత్యంత ధార్మికులగు నార్యపరులకు
ప్రత్యహమును శుభా భయములఁగరుణించు
నిత్యానందుఁడవైన నీకు నీచరితకు.

నాథనామక్రియరాగము - చాపుతాళము.

పల్లవి

82. ఆమహాదేవునకు మంగళం

అనుపల్లవి

ఏమహేశుఁగొల్వ నీమహి సుఖములఁ
గామితార్థములఁ గరుణ నొసంగునో.

# మంగళము

చరణములు.

1. వీరునకు పర ధీరునకు లోకా
ధారునకు సదా చారునకు నిల.

2. నేయునకు మహో పాయునకు పల
ధీయునకు జిత కాయునకు నిల.

3. సుందరునకు సదా నందునకు ము
కుందునకు బ్రహ్మ నందునకు నిల.

# గొబ్బిపాట

## ప్రశ్నోత్తరపు గొబ్బిపాట.

---

మోహనరాగము - ఆదితాళము.

పల్లవి

83. గొబ్బియళ్లో

అనుపల్లవి

గొబ్బుగొబ్బునఁ జెలులందఱు గొబ్బిపాటలు పాడరే.

చరణములు

ఎల్లెడల నగపడు నీవస్తువు లెక్కడివే.
ఎచ్చట నుండెడు వీనిని నెవ్వఁడో చేసినాఁడే.
చేసినవాఁ డెవ్వఁడో నాకుఁ జెలియరో! యెఱిఁగింపవే.
సర్వమునకు సృష్టికర్త సర్వేశుఁడొకఁడున్నాఁడే.
సర్వేశు పేరేమి నాకుఁ జక్కఁగా వినిపింపవే.
పేరేది యూరేది వానికిఁ ద్రిభువని పేరొక్కటే.
నల్లగా నుండునా వాఁడు తెల్లగానేయుండునా.
నలుపుగాఁడు తెలుపుగాఁడు నెలఁత! యేమియుఁగాఁడే.

# గొబ్బిపాట

ఎక్కడ నుండునేవాఁ డెవనికి కొమారుఁడే.
జగమంత వ్యాపించువానికి జనకుఁడొకఁడు గలఁడఁటే.
జనకుఁడు మతిలేక వానికి జనన మెట్లు గలిగనే.
జనన మరణములకు నిల జనకుం డాతఁడె కాఁడఁటే.
అతనిభార్య పేరు దెల్పు మతని కెందఱుబిడ్డలే.
సతి యొకతె గలదా యతనికి అతివ! మనమే బిడ్డలమే.
ఎట్టిగుణముగలవాఁ డతఁడు ఎవరికి మంచివాఁడే.
దుష్టుల శిక్షించునతఁడు శిష్టుల పాలించునే.
దుష్టతనము చేయ మనల కష్ట పెట్టునఁటనే.
పాపము చేసెడి వారిని బట్టి శిక్ష చేయునే.
పాపమన నేమో నాకుఁ బడఁతిరో! యిఁకఁ దెల్పవే.
సర్వజ్ఞునాజ్ఞమీఱుటే సఖియ! పాపమందురే.
చెలియరో! యెచ్చట వ్రాసెనే సామి తనశాసనము.
తనయాజ్ఞ తెలియమనకుఁ దరుణీ! బుద్ధొకటిచ్చెనే.
అతఁడిచ్చిన బుద్ధిమనకిఁక నతివ యేమి ఫల మగునే.
ఈశుఁడిట్టివాఁడని తెలిసి సర్వేశుఁగొలుచుటే.
వానిగొలువ మనకు వచ్చువనిత! ప్రయోజన మెద్దే.
శాశ్వత సుఖము మనకు సర్వేశుఁ డొసఁగునే.

# మేలుకొలుపు.

---

భూపాళరాగము - చాపుతాళము.

పల్లవి

84. మనసా! మేలుకో

అనుపల్లవి

మేలుకో మనస! మించుచున్నదివేళ మేలుకో మతి! మేలుకో
మేలుకో యజ్ఞానమనెడు చీఁకటిలోను మఱచి
నిద్రించెదవు మేలుకో.

చరణములు

1. సకలలోకములకు సామియొక్కఁడని, లబ్ధించువేళాయె మేలుకో।
అకలంకస్వరూపు నాత్మలోఁదలఁచెడి, ఆవేళ యిదెచూడుఁ
మేలుకో.

2. ఏకమేవాద్వితీయ మనుకోడి, యెందుఁగూసెడి విని మేలుకో।
లోకేశమమ్ముల రక్షింపనీవొకఁడు, లకోరియనెడిదే మేలుకో.

# మేలుకొలుపు

3. నాన్యఃపంథావిద్యతే అయనాయాది, నానాపక్షులుపలికే మే
లుకో । యాన్యనవద్యాని కర్మాణితానిసేవి, తవ్యానిగాలివీఁచె
మేలుకో.

4. మూఢనమ్మికలను మంచుబొట్లునేల, ముందఱ్రవాలెడి మేలుకో ।
గాఢాంధకారంబగు అజ్ఞానంబిల, కిడలకుదిగఁబ్రాఁకె మేలుకో.

5. నానారీతులను నక్షత్రములుతెల్ల నయ్యెడువేళాయె మేలుకో ।
తానెబ్రహ్మమను తలఁపులదీపముల,తళుకుతప్పెడివేళ మేలుకో।

6. నిజముగోరుబుద్ధి నీరజము తెఱచె, నింకనయినఁజూడ మేలుకో ।
సుజనులకిల నెల్లసంతోషకరమగు, సుజ్ఞానార్కుఁడుదయించె
మేలుకో.

## లాలి పాట

---

మధ్యమావతిరాగము.

85. ప్రేమించు నిగనుములఁ జెలఁగ వసియించి,

1. కామించు భక్తులను గడఁకరక్షించి
ప్రేమించి నిన్ను భావించి పూజించి
ధీమంతు లొందుదురు దివ్యతను మించి.

2. లాలి సర్వాధార ! లాలి నుతధీర !
లాలి కరుణసార లాలి సముదార !
లాలి శుభవిస్తార ! లాలి గంభీర !
లాలి దివ్యాకార ! లాలి యఘదూర !

3. సరసవ్యాప్తి సుజ్ఞానమును గాంచి
పెరిమఁదమ చిత్తాబ్జపీఠముల నుంచి
సారిదిభక్తియను గొలుసులను దగిలించి
గరిమతో నూఁచెదరు కొంతలు నుతించి.

4. ఉరువాఙ్మనఃక్రియల నొక్కటి సలిపి
నిరుపర మార్గముల సూక్తులను గొలిపి
పరతత్త్వ మిదియనుచుఁ జాటించి నిలిపి
గరిత లూఁచెదరు వక్రోజ్ఝతను మలిపి

5. కారుణ్యమతిఁ దమ్ముఁ గాంచి పాలించి
సారవిద్యాశ్రీల చవుల దేలించి
సారెఁ బ్రోచెదవనెడు దనువు లాలించి
సౌరుగా నూఁచెదరు సతులు లాలించి

---

86. తోడి రాగము

పల్లవి

నేఁడు మనమందఱము గూడి పాడుదము పరమేశుని.

అనుపల్లవి

యీఁడు జగమునలేక యంతట హెచ్చి వెలిఁగెడు జ్యోతిని.

చరణములు

1. కందరంబుల మందిరంబుల గహన పర్వత సీమల
సుందర ధ్వనితోడ యోగులు స్తుతులొనర్చెడు దేవుని.

2. నూతులందును చెర్వులందును లోఁతు తెలియనివార్ధిలో
శీతజలములు ద్రావి కీర్తన చేయుజలచర మాతని.

3. చెట్టుచెట్టునఁ గాననంబునఁ జెలఁగి మధుర ఋతంబులఁ
బిట్ట లెవనిని బాడుచుండునొ ప్రీతిసాగరు నాతని.

4. ఉత్సవంబుల నుల్లమలరఁగ నువిదలెవ్వనిఁ బాడుచు
నుత్సహింతురొ యాదయామయు నుత్తమోత్తమ పురుషుని.

## 87. కాఫీరాగము.

పల్లవి

నినుఁ గొనియాడఁగ - నేర్చునెవ్వఁడుభువి
మనమున కందని - మహిమలు నీవె.

1. మునులు ఋషీంద్రులు - ముదమున హృదయాన
అనుదిన మునునిన్నె - అరయుచునుండియు
దినకరకోటుల - దివి వెలిఁగించియు
కనఁబడకున్నావు - కరమువిచిత్రము.

2. వివిధజగమ్ముల - వింతగఁ ద్రిప్పుచు
నవనవరీతుల - నటనము సల్పుచు
ఎవరు నెఱుంగని - యేకాంతమ్మున
ప్రవిమలకాంతితో - భాసిలుచుందువు.

3. నమ్మినభక్తుల - నెమ్మదిలోపల
తుమ్మెదవలె వ్రాలి - ఝుమ్మనిపాడుచు
కమ్మనిభక్తిర - సమ్మును గ్రోలుచుఁ
గొమ్మని శుభములఁ - గురియుచునుందువు.

88 కాంభోజి రాగము - రూపక తాళము.

పల్లవి

ఓ నాథ నీగుణ మొకయింత దెలిసిన । వానిజన్మమే జన్మము.

అనుపల్లవి

మానసముప్పొంగి మేను పులకరించి ।
ఆనందాశ్రువులొలుక నారంభమగు దేవ.

చరణములు

1. జ్ఞానము కరుణయు న్యాయము వర్ధిల్లఁ బూనధర్మవ్రతము । మానాభిమానముల్ మదినిదలంపక । తానూనియాజ్ఞకై తను వూను అర్పించు.

2. ఎన్ని కీడులుమూడి తన్ను బాధించిన । అన్న విడువగల్గినా । నిన్నె దలోనుంచి నీయాజ్ఞ పాలించి । తన్ను నిరతముప్రోచు తండ్రిడనీవెయంచు.

3. సత్యమేనమ్మిచు సత్యమేపల్కుచు । సత్యమేయాచరించు । అత్యంతభక్తితో నన్నిటనినుజూచి । నిత్యానందములోన నిరత మోలలాడుచు.

4. దీనులయాపదల్ దీర్పంగసమకట్టి । నానాబాధలుపడుచుఁ। ప్రాణమున్న వఱకుఁ బరులకుఁదోడయి । తానుజీవనయాత్ర ధన్యముగాసల్పు.

89. బేహాగురాగము - ఆదితాళము.

పల్లవి.

ఈశుని సేవింపరే - పర - మేశు నుపాసింపరే॥

అనుపల్లవి

నాశనరహితుడు - నమ్మినదరిచేర్చు॥ ఈశుని॥

చరణములు

నిఖిలపాపములను - నిర్మూలముసేసి ।
సుఖమిచ్చుననియెంతో - సుకరముగాఁ బర॥ మేశుని॥

లోకనాయకుఁడు - లోకారాధ్యుఁడు ।
వీకతోడమనల - వేమరు గాచెడి॥ ఈశుని॥

భవవినాశనుని - భక్తితోఁగొలిచిన ।
భవములనన్నియు - బాపివేయు వేగ॥ ఈశుని॥

దాసవరదునికి - దోసిలియొగ్గినఁ ।
దాసగణములను - దయతోడఁబ్రోచుపర॥ మేశుని॥

ఈతఁడే మనఘన - పాతకములఁ బాపు ।
నేతగానవాని - నిరతము వేఁడిపర॥ మేశుని॥

90. సురటిరాగము - ఆదితాళము.

పల్లవి

భజియింపరారే - బ్రహ్మస్వరూపుని॥

అనుపల్లవి

సుజనరక్షణశీలు - నజుని ననంతుసదా॥ భజియింప॥

చరణములు

నిత్యముగానియీ - నిఖిలప్రపంచమును ।
సత్యాదరముతో - నాశ్రయింపకను ।
సత్యస్వరూపుని - సన్నుతించినమనరు ।
నిత్యానందపదవి - నిజముగఁజేకూరు॥ భజియిం॥

కామాంధకారమునఁ - గన్నులుగానక ।
పామరకృత్యములఁ - బనిఁబూనిచేయక ।
వేమలుస్వామిని - వేడుకగొలిచిన ।
తామసములమాన్పి - తాలిమినేలఁడా॥ భజియిం॥

ఆలుసుతులనమ్మి - ఆయువుగడపుట ।
తేలలేనట్టియీ - తెగులుపొందుటేగాని ।
వీలుచాలులేనియీ - వివిధవ్యాధులకెల్ల ।
మేలైనయాషధము - మేదినిహరిభజన॥ భజియిం॥

91. భైరవిరాగము - రూపకతాళము.

పల్లవి

దండముగొను దేవపాప - దండనమున కోర్వలేము.

అనుపల్లవి

అండఁజేరినారముమా - చండితనము నెంచకిపుడు॥ దం॥

చరణములు

పక్కతోడనుండినీవు - మక్కువవెదఁజల్లిమాకు ।
లెక్కలేనిపాపములను - ఉక్కడంచిమక్కువగను॥ దం॥

కరమునిన్నెనమ్మినాము - పరులనువేఁడఁగనుబోము ।
కరమొసంగిపాపవార్ధిఁ - బొరలెడుమము దరిజేర్చుము॥ దం॥

భావపురనిలయమా - భవములనెడఁబాపుటకును ।
నీవుగాకనింకమాకు - నెవరుదిక్కులేరుసామి॥ దం॥

92. భైరవిరాగము - రూపకతాళము.

పల్లవి

మక్కువతో మ్రొక్కుమాదు - మ్రొక్కులనునిక్కముగ॥

అనుపల్లవి

ఎక్కువైనఁగనికరమున - గ్రక్కునగైకొనుము స్వామి॥

చరణములు

పాపానలమునఁ దగిలిన - తాపమునకునోపలేక ।
పాపరహితవేగమే మా - తాపములను బాపుమనుచు॥ మరు॥

శోకమోహరూపంబగు - లోకములోనుండిమేము ।
ఏకరణిని గడువలేక - నీకరుణఁబడయఁగోరి॥ మరు॥

దాసగణచకోరములను - ధన్యులఁజేయునీచంద్రిక।
కాసఁజెందినిట్టినీ - దాసులదరిఁజేర్చుమనుచు॥ మరు॥

## 93. హిందుస్థానికాఫిరాగము - ఆదితాళము.

పల్లవి

వందనముగొనవే - వందనముగొనవే - వాత్సల్యనిధివీవే ।
సందేహములఁబాపవే - రావే - నీకందువులనేలవే॥ వం॥

అనుపల్లవి

సర్వాంతర్యామివై - సర్వమునీవయై ।
యుర్వీంబ్రోచుజనకా - నీదుపాద - యుగ్మమునకునిదిగో॥

చరణములు

కపటచిత్తులఁగూడి - కుపితమనస్కులై ।
యపరాధములజేసినానీసుతులపై । నలుగకుమేమిడిన॥ వం॥

ఎందునఁజూడనీ - వుందువనెడుమాట ।
ముందెరుగక చెడిన - నీబిడ్డల । పొందుగనేలుకోన॥ వం॥

కామక్రోధాదులఁ - కఠినమృగంబులు।
వేమరుమముఁగ్రింగగఁ - జూచెదు । వేగమెనివారింపవే॥ వం॥

భావపురీశ నీ - సేవగోరినమముఁ ।
బ్రోవనిదేసమయము - పాపాగ్నిలోఁ । బాగులుచున్నారము॥వం॥

## 94. జంఝూటిరాగము - ఆదితాళము.

పల్లవి

శంకరభక్తవ - శంకర యేలర ।
శంకయేల మా - వంకనుజూడర॥ శం॥

చరణములు

సర్వమందుండియు - సతతముజనులను ।
ఉర్వినిబ్రోవగ - బిరుదుకహించిన॥ శం॥

ఈషణత్రయమను - దోషాంబుధినిల ।
ఘోషిలుమానవ - పోషణశీల॥ శం॥

కామాదులచే - గాసిలినొందిన ।
పామరజనములఁ - బ్రోపగు దేవా॥ శం॥

నిత్యానందా - నిఖిలనిర్మాతా ।
సత్యస్వరూపా - సదమలరూపా॥ శం॥

95. హిందుస్థానికాఫిరాగము - అటతాళము.

పల్లవి

ధ్యానముసేయరే - మానసనిలయుని ।

అనుపల్లవి

హీనతలఁ పులమాపు - దీనరక్షకుని॥ ధ్యానము॥

చరణములు

చింతలువదలఁగ - స్థిరమతిగూడఁగ ।
అంతరంగునిదలఁచి - యందనుసుఖముల॥ ధ్యాన॥

నిత్యమే దేహము - సత్యమే బంధువులు ।
సత్యసంధునివేఁడి - నిత్యపదవినొంద॥ ధ్యాన॥

దుష్టులశిక్షించు - కష్టములెడఁబాపు ।
శిష్టపాలకుఁగొలిచి - సేమముపడయను॥ ధ్యాన॥

మనసునకందక - మాటలకందక ।
మనలనేలునట్టి - మహదానందనిధి॥ ధ్యాన॥

విచ్చలవిడిగాను - విషయలోలులమై ।
చచ్చుచుఁబుట్టుచుఁదిరిగి - చనఁగలమె పరమునకు॥ ధ్యాన॥

పాపతాపహారుని - ప్రాణేశునీశుని ।
తాపత్రయములణఁచి - తరియింపఁజేయును॥ ధ్యాన॥
బ్రాహ్మసమాజకులఁ - బ్రాపైయున్నవాని ।
నెమ్మనములనిలిపి - నిత్యానందమునొంద॥ ధ్యాన॥

96. ముఖారిరాగము - రూపకతాళము.

పల్లవి

వినుఁడిహితముగొనుఁడి - మనవిభునిగనెడిమార్గముగనుఁడి॥ వినుఁడి॥

అనుపల్లవి

ఘనుఁడగుమనజనకునితోఁ - జనువుగల్గక మనుటకుఁదగదిఁక॥ వినుఁడి॥

చరణములు.

జననకాలమునశిశువుకుఁ - దనయందే ప్రేమగల్గుఁ ।
జనఁగజనఁగఁదల్లిదండ్రులు - మునుగలబంధులను బ్రేమించును ।
పనుపుగనాగతిలోకము - తనచూడ్కికినొక్కటిగాఁగను।
మనముననెంచుకొనక - మనుజుఁడనఁగఁదగడుగనుక ॥
లోకంబునప్రేమింపన - నేకములిడుములఁదొడరును।
గాకవానిపాటింపక - కరుణమదినిబూనియోచింపక।
లోకనాథువేఁడుకొనిన - నేకొఱఁతయులేదుగాన ।
నీకలుషపుమదివీడుఁడు - ఆకరుణానిధివేఁడుఁడు॥ వినుఁడి॥

దేహంబేస్థిరమనుచు - దృఢముగమదినెంచుకొనుచు।
సాహసించిచరియించుచుఁ - జనకనెవరుమనిరిభువిని।
మోహాదులతోఁగూడక - ముక్తిమార్గమునుజూడక।
స్నేహభావమునువీడక - చెడుటమనకుఁదగదుగనుక॥ వినుఁడి॥

**97.** జంఝూటిరాగము - ఏకతాళము.

పల్లవి

ఏమిసేతునయ్యా - భూనాయక
సేమమొసఁగవే - యోనాయక॥

అనుపల్లవి

నీమముతో మేము - నిన్నెనమ్మితిమి।
కామితార్థదా - కాపాడవేరా॥ ఏమి॥

చరణములు

నిర్మలాత్మ మేము - నిన్నెనమ్మితిమి।
కర్మములఁబాపి - కడతేర్చవేరా।
ధర్మశీలవేగ - దయయుంచిమాకు।
మర్మములెంచక - మన్నించిప్రోవు॥ ఏమి॥

98. శంకరాభరణరాగము - ఏకతాళము.

పల్లవి

పరమాత్మమమ్మేల - పాలింపవుదేవ॥ పర॥

అనుపల్లవి

నిరతము నీసేవ - నిజముగఁ జేయుచుండ॥ పర॥

చరణములు

కన్నులనినుఁగన - కలనాయెనో నాథ।
పన్నగమమ్మిప్రుడు - మన్నించియేలుమన్న॥ పర॥
ఘోరములకెల్లఁ - గారణమగుసం।
సారమునుండినీ - సన్నిధఁజేర్పుమన్న। పర॥
కారుణ్యమూర్తిమా - కష్టములనుబాపి।
చేరఁదీసిమమ్మిప్రుడు - చేపట్టుమనివేఁడ॥ పర॥

99. శ్యామరాగము - అటతాళము

పల్లవి

ఈశాజగదీశా సర్వేశ - ననుఁగావవె కావవె కావవె॥

అనుపల్లవి

నాథనిన్నెమది - నమ్మియున్నవాఁడ।
నాపైనిదయయుంచర - మదినెంచర పాలించర॥ ఈశా॥

చరణములు

దిక్కు నీవనుచును - దిక్కుడఁదలచక।
మెక్కి తిరిగినజనులఁదర - పాపులఁదర దీనులఁదర॥ ఈశా॥

ఎందుఁజూచిననీ - వుందువనుచువినియు।
మందులైయుంటిర - కనుగొంటిర మేల్కొంటిర ఈశా॥

ఉర్వినిమనుజుండై - యుద్భవించినఫలము।
సర్వేశనినుగాంచఁగ - సేవింపఁగా ప్రార్థింపఁగా॥ ఈశా॥

100. కళ్యాణిరాగము - ఆదితాళము.

పల్లవి

ఎన్నఁటికినిన్నుఁగను - మన్ననలఁగందుమోమా।
యన్ననీదయ రా - కున్నదిదేమిరా॥

అనుపల్లవి

క్రన్ననమాదుమొర - విన్నవించఁగనీ।
కన్నామాకిఁకనెవ - రున్నారోపన్నుత॥ ఎన్న॥

చరణములు.

జరామరణాదులచే - దురవస్థలకులోనై।
నిరతమిద్ధారుణిఁ - జరియింపఁగనోడి।

నిరాదరులమని - మఱిమఱివేఁడిన।

బిడానన్నేలవో - పరాత్పరా యిఁక॥ ఎన్న॥

వేఁడకనె అన్నియిడి - పాడిమిబ్రోచినట్టి।

నాఁడనను నాశనిముఁ - జూపఁగఁగోరియెంతో।

పాడి వేఁడినమము - నోడకుఁడనివాతోడ।

నాడిదర్శనమీయ - బాడిగాదేర నోరఁ॥ ఎన్న॥

అనయవరహితుఁ - డవిముల డవాధారుఁ।

డ వంతరాత్మవును - భువనైకనాయకుఁడ।

వవుని నేశరణని - సవినయముగ వేఁడఁ।

గవినిము ముఁబ్రోవు - కరుణానిధేయిఁక॥ ఎన్న॥

## 101. సావేరిరాగము - రూపకతాళము.

పల్లవి

జగదీశా భవవినాశా - జాలమిఁకేల ప్రోవుమిదాసుల॥

అనుపల్లవి

అగణితదుర్వారబంధఁబులఁ - దగిలివగలబొగులుదున్నారము॥ జగ॥

చరణములు

ఎక్కడఁజూచిన నొక్కఁడవీవు - ఏమిర మా మొఱ లేలవినరావు।
అక్కటనీవేమ మ్మాదరింపకున్న - దిక్కెవ్వరున్నారో దేవదేవ
నీకన్న॥ జగ॥

కూళలై నేరము లోకిసల్పుతన-బాలురదండించి తాఁ బారగఁదోయిలఁగఁ।
జాలునెనీయెడ చాలాప్రేమతోడ - జాలిఁ జెఁదినమ మ్మేలవిదేలర॥
జగ॥

ఎంతనివేఁడుదు మేమనిచింతింతు - మేరనీదయ మాపైనిగల్గనేని।
యింతవరకు నిన్నెంచుచేచాలునీ - స్వాంతంబున నెటులెంచితో
గాని॥ జగ॥

కమాచిరాగము - ఆదితాళము.

పల్లవి

102. రారామా మొఱవినర - రక్షకవేగ॥

అనుపల్లవి

తారకమీవేయను - తనయులమమ్ముఁబ్రోవ॥ రారా॥

చరణములు

కలలోనైనను - నిలనినుమఱవక।
తలపునముంచుమముఁ - దగునుదగునుఁబ్రోవ॥ రారా॥

ఆపద్బాంధవ - పాపాగ్నిని బడి।
తాపముఁ బొందితిమయ్యాఁ - దరింపఁజేయవేగ॥ రారా॥

అనయము నీకథ - వినయముతోనిను।
తనయుంబ్రోవక - తప్పదు ఇఁకనో తండ్రి॥ రారా॥

హరిహరియనుచును - పరిపరివిధముల।
మురియుచునుందుసుము - ముదమునఁగావవేగ॥ రారా॥

## 103. బేహాగ్ రాగము - ఏకతాళము

పల్లవి

దేవదేవవేగరా - దీనులమిఁకఁబ్రోవరా॥

అనుపల్లవి

సేవసేయువారలమే - సేమముతోఁగావవే॥

చరణములు

ఇంతేపంతమేలర - యిహపరాధీశ్వరా
యెంతప్రార్థింతుము మా - వంతలడఁపనిరుపమా॥ దేవ॥

లోకమందు మేము ఈ - శోకముపడఁజాలము।
ఓకరుణానిధిమ - మ్మేకరణి గాచెదో॥ దేవ॥

కామరహితజనక మా - పామరముఁబాపుమా।
స్వామినీవన మేలమా - సరసమా యధకారమా॥ దేవ॥

104. హిందుస్థాని కాఫిరాగము - త్రిపుటతాళము.

పల్లవి

నన్నుఁ బ్రోవవేమి తండ్రి

అనుపల్లవి

నన్నుఁ బ్రోవవేమి-నామీదదయలేదేమి।
నిన్నువినాయేరి-సన్నుతిసేయను ॥ న॥

చరణములు

ఆర్తరక్షణసేయు - కర్తవునీవని పా।
పార్తిని వేఁడితి - పాపతాపము దీర్చి ॥ న॥
తల్లిదండ్రులును - పిల్లలుభార్యయు
ఎల్లవిభవములును - గల్లలంచును వేఁడ ॥ న॥
ఏలయీలీలను - జాలినొందించుట।
మేలాజాలమేలనీ - బాలుఁడ నేఁగాన ॥ న॥
కరుణారసపూరిత - శరణాగతత్రాణ।
సరగునమొఱవిని - దరిఁజేర్చి సేదదీర్చి ॥ న॥

105. ఖమాచిరాగము = రూపకతాళము.

పల్లవి

నిన్నే నమ్మినామురా - మన్నించి మమ్మేలుకోరా ॥



అనుపల్లవి

అన్నా నిన్నెంత వేఁడు । కొన్నా వినకున్నా మా బన్నము
లెటుఁబాయునిఁక ॥ ని॥

చరణములు

జనన మొందుటాదిగ మా సల్పు కృత్యములఁదలఁచిన । మనమున నెంతెంతో
వనట । వెనఁగొనిమనసీకున్నది నినుఁబాసిన నెటులోర్తుము॥ నిన్నే॥

ధర నిడుములసుఖములనుచు - దరిగానక భ్రమియించి । పరిపరివిధముల
బాధలఁ । బడివేడినఁబ్రోవరాద - పరమపురుషమాతో వాదా ॥ నిన్నే॥

నిరామయ నిరంజన నిఖిలనిర్మాత నిరవయవ - నిరుపమాకార నిశ్చల ।
నిత్య నిర్మలానంత సత్యరూప సార్వభౌమ ॥ నిన్నే॥

మంగళము.

సౌరాష్ట్రరాగము - ఆదితాళము

పల్లవి

106. సర్వాంతర్యామినీకు - సదాజయమంగళం ॥

అనుపల్లవి

ఉర్విని సర్వమును - నిర్విఘ్నముగ నేలు ॥ స॥

చరణములు

ఆత్మలకాత్మవై - ఆనంద మొసఁగుచుండు ॥ స॥

దీనులపాలి పెన్ని - ధానమై వెలయుచుండు ॥ స॥

సర్వభూతములకు - సమసౌఖ్యమొసఁగుచుండు ॥ స॥

కామాంధకారులకు - కను మొఱఁగియున్నట్టి ॥ స॥

మదినిలిపిచూచువారి - మనమునఁదోఁచునట్టి ॥ స॥

భావపురీశుఁడవై - ప్రణతార్తిహరుఁడవైన ॥ స॥

**107.** జంఝూటిరాగము - ఏకతాళము.

పల్లవి

మరిమరి నిన్ బ్రతిమాలెద మనసా న న్వినవే।

అనుపల్లవి

పరిపరివిధములుగా నా పరమేశుని బాడవే॥ మరి॥

చరణములు

తెగడఁగనే వగవకె నిన్నొగడఁగనే పొంగకే।

జగమునఁగల చిత్రములను శాంతితోఁ గనుచుండవే॥ మరి॥

ముద్దుసతియు సుతులఁజూచి మోహాబ్ధిఁ బడి మున్గకే।

వద్దువద్దు వారలెల్ల వహ్ని కాజ్యధారలే॥ మరి॥

(హాసలు) మర్కటంబవీవందు నిప్పుద్రొక్కకే
పసదనమును ఖాదుచేయు పరార్థంబుల ముట్టకే॥ హరి॥
వంకర త్రోవలం జని దుఃఖ-పంకమునన్ బడకే।
శంకరుపాదముల నెపుడు జపియించుచు నుండవే॥ హరి॥

**108.** బిళహరి - రూపక తాళము.

పల్లవి

ఈశ్వరుని మహిమ యెంతో బ్రహ్మానందము

అనుపల్లవి

సంలలిత మా సుందరేశుని స్వామిని ధ్యానించువేళ॥ ఎంతో॥

చరణము

తంబూరా తాళ మృదంగములను జతచేసి।
యంబికా సమేతుని నాత్మలో ధ్యానించువేళ॥ ఎంతో॥

**109.** రాగం-అసావరీ

పల్లవి

భజో సుఖర హరి నాం - నిరంతర॥

1. సరళ భావసే హరిభజో రే। పావే సోసుఖదాం॥ నిరంతర॥
2. హరిహీ సుఖ హై హరిహీ శాంతీ। హరిహీ పాణారాం॥
3. హరిహీ పాపసేముక్త కరేజో భజన కరే అలిరాం॥

110. తుహీ్మ బంధు తుహీ్మనాథ। నిశిదిని తుహీ్మ ఆధార॥
తుహీ్మసుఖ తుహీ్మశాంతి। తుహీ్మఆహా అమృతసాగర॥ ప॥
తుహీ్మ అహాం ఆనందలోక। శాంత విప్రాణనాశి శోక॥
తాప హారణ ఆపులె చరణ। అసిమ శరణ దీన జనాంచే॥

111. జయదేవ జయదేవ జయత్రిభువనకర్తా। ప్రభు। సబకే ఆశ్రయదాతా భయసంకటహర్తా॥

జడచేతన సబజేతే మహిమాతవగావే। ప్రభు। రాజాప్రజా సబహి తుజకో శరణావే॥

అటలతుహ్మారీ కరుణవర్ణనహీ జాయీ। మంగళ కీర్తితుమాకీ గగన గగనచ్ఛాయీ॥

తుమచేతన పరమేశ్వర। తుమపూరణస్వామీ పుణ్యాపాప మమదేఖో ప్రభు అంతర్యామీ॥

అటలజ్ఞానకీ చహదిశజ్యోతీ విస్తారీ। నిరఖునిరఖు హోచకితజగకే నరనారీ॥

హాయ అనంత తవశక్తీ వర్ణనకి మకీజే। కరోగర్వ ప్రభుచూరణ, నిజ ఆశ్రయదీజే॥

బిక్షాయహి హాయ హామరీ హేమంగలదేవా। నిశిదినహో ఉత్సాహిత కరతేతోరిసేవా॥

## 112. యమునా కళ్యాణి - ఝాపలా.

శాశ్వతమభయ మశోకమదేహం, పూర్ణ మనాది చరాచరగేహం।
చిన్తయ శాన్తమతే పరమేశం, స్వీకురు తత్త్వవిదా ముపదేశం।
దినకరశశిర కరావలియాతః యస్యభయాద్విధావతి వాతః॥

భవతియతో జగతోస్యవికాశః
స్థితిరపి పునరిహ తస్యవినాశః॥

యదను భవాదపగచ్ఛతి మోహః భవతిపునర్న శుచామధిరోహః।
యేనభవతి వినయః కరణానాం జగతిపరం శరణం శరణానాం॥

## 113. ఖట్ - ఏకతాళము.

ధన్యదేవ పూర్ణబ్రహ్మ ప్రాణేశ్వర దీనబంధు,
దయాసింధు కరుణానిధి వ్యాకులచిత వారిహో॥ ధన్య॥
భగవజ్జన-హృదిభూషణ, పావన జగజీవన,
(ప్రభు) పరమశరణ, పాపి-గతి ఆశ్రిత-భయ హారిహో,
అచ్యుత ఆనందధామ, సత్యాశ్రయ సత్యకామ,
జాగ్రత జీవంతదేవ, సేవక-కాండారీ,
జ్ఞానానల దీప్యమాన, హృదాధార హృదయేశ్వర,
భవతారణ హరికృపాళు, భక్త-మన - విహారిహో,
అవినశ్వర పురాణ పురుష, భగవాన్ భక్తవత్సల,

కళ్యాణ అసురవిశ్వ - భువనధారీ,
జీవితేశ హృదయ - రత్న, పరమాయన సత్యపురుష,
సదానంద జగద్గురు, జగజ్జన హితకారిహో॥ ధన్య॥

**114.** ముల్తాణ్ మిశ్ర - ఏకతాళము.

జయజ్యోతిర్మయ, జగదాశ్రయా, జీవగణ - జీవనా॥ జయ॥
తుమి పరమేశ్వర (ప్రభుహే) పూర్ణబ్రహ్మ ఆది అన్తకారణ॥ జయ॥
మహిమారింద్ర, దయారచంద్ర, స్నేహే పరాజిత భువనా,
అమిఅధమ పాతకి, కరజోడేడాకి, దావుమోరె తవ చరణా॥ జయ॥
ప్రేమేరపాథార్, పుణ్యేర్ ఆధార్, క్లేశ-కలుష - నాశనా,
తుమిదీనశరణ, భకత-జీవన. లజ్జాభయ-వినాశన॥ జయ॥

**115.** నారాయణి - యత్.

భజరే, భవఖండనే, భజరె విశ్వజన - వందనే
జగత్ - రంజన భకత-చిత్త - వినోదనే, మోదనే,
పాలనే, తారణే, ప్రణతజన - సౌభాగ్య-జననే॥ భజరే॥
శుద్ధసత్త్వ జ్యోతిర్మయ జ్ఞానే, ముక్తిదాతా జగత్ప్రాణే,
అంతర్యామీ నిత్యపురాణే, శాశ్వతవిభుకృపానిధానే,
పూర్ణబ్రహ్మ సనాతనే, సమస్తపాతక నాశనే,
సర్వలోకాశ్రయ - ప్రభవే, సత్యాత్మనే, ప్రేమాత్మనే। భజరే॥

## 116. యమునా బేహాగ్ - దాద్ రా.

వన్దిదేవ దయామయ తవచరణే,
తుమిహే భవసాగర జీవన్మరణే॥ వంది॥
పితామాతా సఖాతుమి త్రిభువననాథ,
గతిర్ముక్తి భక్తదాతా కరిప్రణిపాత॥ వంది॥
అమృతనిలయ తుమిప్రేమేర యాధార్,
తవపదే ప్రాణసఖా నమి శతవార॥ వంది॥

## 117. ఓ. బేహాగ్ - ఝంపతాళము.

జయ జగ జీవన ఖగత - పాతహే,
జయ దీనశరణ శుభ - దాతాహే॥
జయ విఘ్ననాశన వి - ధాతాహే,
జయదేవ జగత-పితా - మాతాహే॥ జయజగ॥
హృదయాధార హృది - జ్ఞాతాహే,
భయ - తాప-హారణ భవత్రాతాహే,
దీనజన ద్వారే, డాకేతుమారే,
దేహిప్రసాద పరమాత్మాహే॥ జయజగ॥

## 118. భైరవి - ఏకతాళము.

జయ విశ్వపితా భగవాన్ దయానిధి
భక్తసఖా జగవందన హే॥
పరమేశ మహేశ అశేష గుణాకర,
సర్వజన ప్రతిపాలక హే॥
జగదీశ్వర జాగ్రత మంగళ-ఆలయ,
సంకట-మోచన ప్రేమధన;
భయతాపనివారణ నామసుధాతవ,
పావనకరే ఋషియోగిజన॥ జయ॥
చిరజీవన యాశ్రయ, శాన్తిరసాగర,
దీనఅనాథ జనేరగతి,
శివసుందర ఈశ్వర దేవనిరంజన,
విఘ్నవినాశన లోకపతి ;
అసహాయ అకించన చంచలబాలక,
యాచెవరాభయ ఓచరణే;
సుగభీర కృపాతవ, సంబళ కేవల,
దేహివిభోగతి హీనజనే॥ జయ॥

## 119. ఆనందభైరవి - చాపుతాళము.

జయ సత్య సనాతనా, జయ అనాదికారణా,
జయ పరమశరణ పాలక హే,

జయజ్ఞాన-విభాకరా జయమోహ - తమ-హారా,
జయగురు కల్పతరూ, నాయకహే॥ జయ॥
జయఅనంత అపారా, జయసర్వ మూలాధారా,
జయఅనంతసంపద - ఆకరహే।
జయమంగళ నిధానా, జయ అమృతసోపానా,
జయజగత - కళ్యాణ విధాతాహే;
జయదేవ సర్వేశ్వరా, జయపూర్ణపరాత్పరా,
జయ సర్వలోకపితా మాతాహే॥
జయశివ సుందరా, జయప్రేమ సుధాకరా,
జయప్రాణ - మనోహర శోభనహే;
జయహేజీవన - పతీ, దా ఒహే జీవనే ప్రీతి,
దివానిశికరి జయకీర్తనహే॥ జయ॥

## 120.

లక్ష్మి-శాంర

తుమిబ్రహ్మ సనాతన విశ్వపతి, తుమి ఆది అనాది అశేషగతి।
తుమిసత్య సదాత్మక చిన్మయహే, తుమి విశ్వచరాచరఆశ్రయహే।
తుమి పూర్ణపరాత్పర కారణహే, తుమిదీనజనాశ్రయ తారణహే।
తుమిమంగళ చిత్తవినోదనహే, మనోమోహన శోభనలోభనహే॥
తుమిపావన విఘ్ననాశనహే, తుమిపాతకరాశి హుతాశనహే।
కరుణాకరహే గుణసాగరహే, కతయేకరుణా అధమేకరహే

ప్రభుపాపశతే మృతయేజనహే, పరశేలభయే నవజీవనహే ।
భవసింధుజలే అకూలేడరిహే, ప్రభుదేవాసబే కరుణాతరిహే॥

**121.** ఆశా-శూంరి (ముఖారి.)

పరమపితాతుమి, జగజనమాతా।
పరమసఖా పరమేశ్వర ప్రభుతుమి, పరమగురుజ్ఞాన దాతా॥ పర॥
దీన-అకించన - శరణ-సహాయతుమి, పరమశాన్తి శుభదాతా।
అనాథనాథప్రభు, పతితపావనా, పాతకనాశన త్రాతా॥ పర॥
భరసాతవ పరసాద-ప్రమాదే, హేభవపాతా, విధాతా,
కరుణాసాగర, దేహాకృపాజలదగ్ధ హృదేహృద్-జ్ఞాతా॥ పర॥

**122.** ఆశా - శూంరి.

జగతపితాతుమి విశ్వవిధాతా।
అమరాతుమారి, కుమారకుమారీ, తుమిహారిసబ సుఖదాతా॥ జగ॥
రాజరాజేశ్వర, సర్వభువనపతి, పతితపావన దీనబంధూ;
అనాథగతితుమి, అనాదిఈశ్వర, కరుణాకర కృపాసింధూ॥ జగ॥
సంకటమోచన, అభయచరణ తవవందిఛె సురనరబృందే,
జనమదియాఛాయాది శరణదితేహాబె, శీతలచరణారవిందే॥ జగ॥



PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B161 |
| పుస్తకం పేరు | బ్రహ్మోపాసనాపదద్ధతి బ్రహ్మగీతములు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 11 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | aksanaa |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ursro |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |